

# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంకాదు

సీతాకోక చిలుకలు ఎట్లు జీవిస్తున్నాయో ఈనాడు ఆమె తెలుసుకుంటున్నది. ప్రతిరోజూ జీవితమును గురించి ఆమె ఎక్కువగా తెలుసుకుంటున్నది. పళ్ల, పనుచిగుళ్ల భద్రతపట్ల రోజూ శ్రద్ధ వహించవలసిన విషయం కూడ మీరు ఆమెకు బోధించాలి. ఆమెకు వృద్ధాప్యంలో కూడ సహజమైన పళ్లుంటవి. మీ వివేకమును ఆమె సర్వదా స్మరించుకుంటూ, దంతక్షయం, పనుచిగుళ్ల బాధల బారినుండి తనను రక్షించినందుకు మీకు అభివందనాలు అర్పించుతుంది. మీ పిల్లలకు వారెప్పటికైనా నేర్చుకోవలసిన అత్యుత్తమమైన అలవాట్లను ఈనాడే బోధించండి- ఫోర్‌హన్స్' టూత్ పేస్టుతో రోజూ పళ్లు, పనుచిగుళ్లను తోముకుంటూ వుండాలి. అమెరికా యందలి దంతవైద్యుడు డాక్టర్ జె. ఆర్. ఫోర్‌హన్‌చే సృష్టించబడిన ఫోర్‌హన్స్' టూత్ పేస్టు ఒక్కటే ప్రపంచములో ఆరోగ్యవంతమైన గట్టి పనుచిగుళ్లకు, మెరిసే తెల్లని పళ్లకు అనుకూలించే ప్రత్యేక పదార్థములు గలది. ఆర్. జె. ఫోర్‌హన్, డి. డి. ఎస్. చికిత్సననుసరించిన "CARE OF THE TEETH AND GUMS" (ఇంగ్లీషులో) తపాలా ఖర్చుల నిమిత్తం 15 న. పై. తపాలా బిళ్లలను పంపండి: ఫోర్‌హన్స్' డెంటల్ ఎడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం. 10031, బొంబాయి-1.

## COUPON

Please send me a copy of
"CARE OF THE TEETH AND GUMS"
Name ..........................................................................
Address ......................................................................
C.1 ...........................................................................



## చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★


| | |
|---|---|
| భారత చరిత్ర - 28... | 2 |
| మహాభారతం ... | 5 |
| రాకాసిలోయ - 31... | 9 |
| కాకి సహాయం ... | 17 |
| ఖలీఫాల సంపద - 1 | 25 |
| హత్యానేరం ... | 33 |
| వల్కల చీరి ... | 39 |
| రాకసి మెట్లు ... | 43 |
| రామాయణం ... | 49 |
| ప్రపంచపు వింతలు... | 57 |


ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



## కేవలం విక్స్ వేపొరబ్ మాత్రమే
## రొంప జమకూడే మూడుచోట్లా తక్షణం పనిచేస్తుంది...

# రాత్రికి రాత్రే రొంపను మాపుతుంది




**విక్స్ వేపొరబ్ రెండు విధాల పని చేస్తుంది — రాత్రి అంతా కూడా — ముక్కులోనూ, గొంతుకలోనూ, ఛాతీలోనూ, పనిచేసి మీ రొంప బాధను తొలగిస్తుంది. మీరు సులువుగా గాలిపీల్చుటకు, హాయిగా నిద్రపోవుటకు తోడ్పడుతుంది.**

రొంప తొలి చిహ్నాలు కనబడగానే, ముక్కు వెంబడి చీమిడి, కారడం గొంతుపుండూ, దగ్గూ, ఛాతీలో భారం, ఈ చిహ్నాలు కనబడగానే, విక్స్ వేపొరబ్ ఉపయోగించండి. కేవలం విక్స్ వేపొరబ్ మాత్రమే రొంప జమకూడే ఈ మూడు చోట్లా అంటే ముక్కూ, గొంతుకా ఛాతీలలో వెంటనే పనిచేస్తుంది. రొంప బాధలను రాత్రికి రాత్రే దూరంచేస్తుంది. నిద్ర పోయే ముందు, విక్స్ వేపొరబ్‌ను, ముక్కు మీదా, గొంతుక మీదా, ఛాతీమీదా, వీపుమీదా బాగా రాయండి. వెంటనే మీకు, విక్స్ వేపొరబ్ చర్మాన్ని వెచ్చగా చేయడం కనబడుతుంది. అదే సమయంలో మీ శరీరపు వేడి విక్స్ వేపొరబ్‌ను సత్వరం ఔషధాల ఆవిరిగా మార్చి వేస్తుంది. ఈ ఆవిరిని మీరు రాత్రంతా ప్రతిసారి ఊపిరి పీల్చిన పుడల్లా లోనికి తీసుకొంటారు. ఈ అద్భుతమైన ద్వివిధ చర్య, మీరు నిద్ర పోతున్నంత సేపూ జరుగుతూనే వుంటుంది. రొంప హెచ్చుగా బాధపెట్టే, ముక్కూ, గొంతుకా ఛాతీలలో ఉపశమనం కలుగజేస్తుంది. ఉదయానికల్లా మీ రొంప చాలావరకు తగ్గిపోతుంది. మీరు తిరిగి ఆరోగ్యంగా ఆనందంగా వుంటారు.

విక్స్ వేపొరబ్‌ను రొంపజమకూడే ఈ ప్రాంతాలలో ఉపయోగించండి.

| | | |
|---|---|---|
| వేపొరబ్‌ను ముక్కుమీద చుట్టూ రాయండి. | వేపొరబ్‌ను గొంతుక మీదా, ఛాతీమీదా మర్దనా చేయండి. | వేపొరబ్‌ను వీపు అంతటా రాయండి. |



పొడవుగల ఇంటి సీసా



సాధారణపు నీలపు సీసా



తక్కువ ధరగల చిన్న డబ్బా

# విక్స్ వేపొరబ్

కుటుంబానికి చాలా మంచిది — పురుషులకు, స్త్రీలకు, పిల్లలకు

హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ!

# నేను ఆడుకోను, నన్ను వదిలేయ్!

రాజు మాకు ఒక్కడే కొడుకు. వాడు అల్లరిపిల్లవాడైనా భయభక్తులులేకుండా పోలేదు. కాని కొన్నాళ్లనుండి ఉత్సాహముగా కనపడేవాడు కాదు. ఆకలి లేదనేవాడు. ఎప్పుడూ ఓపికలేకుండా యింట్లోనే తిరిగేవాడు. ఒకరోజున మాయింటికి స్నేహితులు వచ్చినప్పుడు రాజుచేసిన పెంకితనమునకు వాడినాన్నగారు కోపము వచ్చి కొడతానని భయపెట్టేరు. అప్పుడు మాయింట్లో ఉంటున్న మా డాక్టరు పిన్ని "ఉండండి, నేను వాడి ఒంటిని ఒకసారి పరీక్షచేస్తాను" అంది.



పిల్లవానిని పరీక్షచేసి ఆవిడ యిలా అంది. "రాజుకి ఒంట్లో ఏమీలేదు. ఎదిగే పిల్లలకు ఎంతో పోషణ కావాలి. అది వారికి లభించకపోతే వాళ్లు చికాకుగా ఉంటారు. రాజుకి రోజూ హార్లిక్స్ యివ్వండి. వాడు మళ్లీ చురుకుగా ఆడుతూపాడుతూ ఉంటాడు.



రాజుకి ప్రతిరోజు హార్లిక్స్ యిచ్చేము. కొన్ని వారాల్లోనే వాడు మామూలుగా తయారయేడు. పెంకితనము అన్న మాటేలేకుండా హాయిగా, చురుకుగా కనపడ్డాడు. పిన్ని, హార్లిక్స్‌లు చేసినమేలు మేము జన్మలో మరచిపోము!




## హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

WT-HL-4821(a)

# అమూల్ పాల ఆహారమందున్న ఏడు విటమినుల ప్రభావం





**విటమిను ఎ**

చర్మమును సున్నితంగా కళ్లను ప్రకాశవంతంగావుంచి పెరుగుదలను వృద్ధిచేయును.

**విటమిను బి1**

నరాలను బలపరచి, హృదయ కండరాలను సమంగా వుంచును.

**విటమిను బి2**

నోరును ఆరోగ్యవంతంగా వుంచును.

**విటమిను బి6**

కండరాలను సడలించును.





**విటమిను సి**

అంటు రోగాలను నివారించి శితాదనమును నిరోధించును.



**విటమిను డి**

బలమైన ఎముకలను, ఆరోగ్యమైన వండ్లను వుంచి పిల్లలరోగాలను నివారించును.

**నయాసినమైడ్**

జీర్ణవృద్ధి, బలమైన నరాలను పెంపొందించి చర్మమును శుభ్రంగా వుంచును.



అమూల్ పాల ఆహారములో యీ 7 విటమినులేగాక, మాంస కృత్తులు. కార్బొహైడ్రేటులు, క్రొవ్వు, కాల్షియం, భాస్వరం సమ పాళ్లలో వున్నవి. అమూల్ ప్రశస్తమైన ఆహార విలువలే ఆధునిక తల్లులకు మన్నిక. మీ బిడ్డకు ఎంతో మంచిది.

**అమూల్ పాల ఆహారంలో మీ బిడ్డకు వలసిన 7 విటమినులు కలవు.**






ASP/ABF-34

# పాఠకుల లేఖలు

## జనవరి 1964

ఈ నెల "చందమామ" అత్యంత ఆకర్షణీయంగా వుంది. కథలన్నిటిలో "కఠిన వ్రతం" చాలా బాగుంది. "రాకాసిలోయ" చదువుతున్నంత సేపూ ముందింకేమౌతుందో నన్న ఆతృత అంత కంతకూ అధికమౌతుంది. "చందమామ మంద హాసం" అప్పుడే అయిపోయినందుకు చాలా అసం తృప్తిగా వుంది. ఇక "సుందరకాండ" అత్యంత సుందరమైన వర్ణ చిత్రాలతో పేరుకు తగినట్టే వుంది. ముఖ్యంగా అశోకవన దృశ్యాన్ని అద్భుతంగా చిత్రించిన శంకర్‌కు నా అభినందనలు.

—యు. రంగాచార్యులు, నెల్లూరు

"సూర్యుడి కిరీటం" అను వ్యాసము పబ్లిక్ పరీక్షకు పోయే మాకు చాల ఉపయోగించి నందుకు సంతోషిస్తున్నాము. అటువంటి విజ్ఞాన దాయకమైన వ్యాసము ప్రచురించిన మీకు మా వందనములు.

—అక్కపెద్ది శ్రీ కృష్ణమూర్తి,
ద్వారకానాథ్, తెనాలి

డిసెంబరు నెల "చందమామ" ముఖ చిత్రం చాల బాగున్నది. దానికి వేసిన రంగులు కూడ రమణీయంగా ఉన్నవి. "పెళ్ళికూతురు", "కఠిన వ్రతం" అనే కథలు నాకు నచ్చాయి.

—గుండుమళ్ళ వెంకట రామారావు,
శ్రీకాకుళం




"కర్పకం" సినిమాలో ఖ్యాతిగాంచిన నూతన తార కే. ఆర్. విజయ యొక్క సుందర చిత్రంతో 400 గ్రాముల బహుమతి పెట్టె త్వరలోనే అన్ని పెద్ద షాపులలో అమ్మకమునకు దొరకును.

న్యూట్రిన్ కన్ఫెక్షనెరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, చిత్తూరు-ఆం. ప్ర.

# OSOLIN

## GEMS...

*Citropine*
*Osaqua*
*Bakul*






For cleansing of porcelain and glassware, plastics, mosaic floorings, dining tables, marble and stone slabs etc.,—CITROPINE

For removal of bactericidal odour, filthy stains and for pleasant aroma– OSAQUA

A marvellous hair tonic and a wonderful brain cooler with lingering fragrance –BAKUL

Made of pure herbal extracts. Non-poisonous and useful for Homes, Hotels, Hostels, Airconditioned Chambers and for Smooth Surfaced Articles or Floors. Can be diluted with water for economy.

*AVAILABLE IN SMALL PACKINGS TOO*

OSOLIN DISTRIBUTORS, 4, THAMBU CHETTY STREET, MADRAS - 1. *Phone:* 22121



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలోని "వల్కల చీరి కథ" రామాయణంలోని ఋశ్యశృంగుడి కథను చాలావరకు జ్ఞాపకం చేస్తుంది. ఈ కథ జైనపురాణాలలోనిది. హేమ చంద్రుడనే 12 వ శతాబ్దికి చెందిన జైన ఆచార్యుడు తన "స్థవిరావళీ చరితం"లో ఈ కథ రచించాడు. ఆచార్య హేమ చంద్రుడు గుజరాతు లోని అహ్నిల్వరాన్ని ఏలిన కుమార పాల చౌలుక్యుడి ఆస్థానంలో ఉండే వాడు. కుమారపాల చౌలుక్యుడు క్రీ. శ. 1143-1172 కాలంలో పాలించాడు.

సంపుటి 34 జనవరి 1964 సంచిక 1





# భారత చరిత్ర



ఫీరూజ్ చావగానే అతని మనమడు తుఘ్లక్ షా, రెండవ ఘియాసుద్దీన్ తుఘ్లక్ షా అనే పేరుతో, సుల్తాను అయాడు. కాని కొందరు ఉద్యోగులూ, కులీనులూ కుట్ర చేసి 1389 ఫిబ్రవరి 19 న అతన్ని తుద ముట్టించారు. అతని అనంతరం అతని దాయాది అయిన అబుబకర్‌ను ఢిల్లీ ప్రముఖులు సుల్తానును చేశారు. ఇదే సమయంలో ఫీరూజ్ కొడుకైన నాసిరుద్దీన్ ముహమ్మద్ పక్షీయులు 1389 ఏప్రిల్ 24 న అతన్ని సామాన వద్ద సుల్తానుగా ప్రకటించారు. అబుబకర్ ప్రత్యర్థులకు తట్టుకోలేక 1390 డిసెంబరులో రాజ్య త్యాగం చేశాడు. నాసిరుద్దీన్ ముహమ్మద్ కూడా ఆరోగ్యం చెడి 1394 జనవరిలో మరణించాడు. అతని అనంతరం అతని కొడుకు హుమయూన్ గద్దె ఎక్కి కొద్ది రోజులు రాజ్యం చేసి ఆ మార్చి 8 నే మరణించాడు. అతని తరువాత రాజ్యానికి వచ్చినవాడు నాసిరుద్దీన్ ముహమ్మద్ ఆఖరు కొడుకు నాసిరుద్దీన్ మహ్మూద్. ఇతనే తుఘ్లక్ వంశపు ఆఖరు రాజు. ఇతనికి నుస్రత్ షా అనే ప్రత్యర్థి ఉండేవాడు; ఇతను ఫీరూజ్ పెద్ద కొడుకు యొక్క కుమారుడు. కొందరు ప్రముఖుల ప్రేరణతో ఇతను రాజ్యాన్ని వశపరచుకొన యత్నించి విఫలుడై, విద్రోహుల చేత చంపబడ్డాడు.

ఫీరూజ్ అనంతరం వచ్చిన వారంతా బలహీనులు. అంతకు పూర్వమే ప్రారంభమైన విచ్ఛిత్తిని వారిలో ఒక్కడు కూడా నివారించలేక పోయాడు. వారందరూ ఢిల్లీ ప్రముఖుల మధ్య సాగిన కుట్రలలో కీలు బొమ్మలుగా వ్యవహరించారు. సింహాసనం కోసం పోటీలుపడ్డ వారి మధ్య అంతర్యుద్ధాలు సాగాయి. ఇందుచేత కేంద్రప్రభుత్వానికి బొత్తిగా పరపతి పోయింది. దేశ

## 28. తుఘ్లక్ వంశ పరిసమాప్తి

మంతటా గల సుల్తాను ప్రతినిధులు, ముస ల్మానులూ, హిందువులూ కూడా స్వాతం త్ర్యం ప్రకటించారు. జౌన్పుర్, గుజరాతు, మాల్వా, ఖాందేష్, గ్వాలియర్, మేవాత్ మొదలైనవి స్వతంత్ర రాజ్యాలయాయి.

ఢిల్లీ సామ్రాజ్యం ఇలాటి అరాజక స్థితిలో ఉండగా అమీర్ తీమూర్ అనే వాడు ఇండి యాపై దాడి వచ్చాడు. తీమూర్ భయం కరుడుగా చరిత్ర ప్రసిద్ధి గలవాడు. ఇతను ట్రాన్స్ ఆక్సియానాలో కేష్ అనే చోట 1336 లో పుట్టాడు, ఒక తుర్కు తెగకు చెందిన వాడు. అతను 1369 లో సమ ర్కండ్ సింహాసనానికి వచ్చి, విజయ కాంక్షతో పర్షియా, అఫ్ఘానిస్తాన్, మెస పొటేమియాల పై దాడులు చేశాడు. ఇండి యాలో గల సంపద అతన్ని ఆకర్షించింది.

తీమూర్ మనమడు పీర్ ముహమ్మద్ అనే వాడు 1398 లో ముల్తానును ముట్ట డించి, ఆరు నెలల అనంతరం వశపరుచు కున్నాడు. 1398 ఏప్రిల్‌లో తీమూర్ పెద్ద సేనతో సమర్కండ్ నుంచి బయలు దేరి, సింధూ, ఝీలం, రావీనదులు దాటి, అయేడే అక్టోబరు 13 న ముల్తానుకు ఈశా న్యంగా 70 మైళ్ళ దూరాన గల తలంబ అనే చోటికి వచ్చి చేరాడు. అతను తలం



బను కొల్లగొట్టి అక్కడి పౌరులను కొందరిని వధించి, కొందరిని బందీలుగా పట్టు కున్నాడు. దారి పొడుగునా అనేక నగరాలు కొల్లగొట్టి, ప్రజలను హత్యచేస్తూ డిసెంబరు మొదటి వారం ఆఖరుకు ఢిల్లీ శివార్లు చేరి, తనకు బందీలుగా చిక్కిన సుమారు లక్ష మంది పురుషులను అక్కడ వధ చేయిం చాడు. సుల్తాన్ మహ్మూద్, మల్లూ ఇక్బాల్ అనే వాళ్ళు డిసెంబరు 17 న, 10 వేల అశ్వికదళమూ, 40 వేల కాల్బలమూ, 120 ఏనుగులూ గల పెద్ద సేనతో తీమూర్‌ను ప్రతిఘటించి, ఘోరపరాజయం పొంది చెరొక దారినా పారిపోయారు.

మర్నాడే తీమూర్ ఢిల్లీ ప్రవేశించాడు. అనేక రోజులపాటు ఢిల్లీ నగరం కొల్లగొట్ట బడింది, అక్కడి పౌరులు భయంకరులైన తుర్కీ సైనికుల చేత దారుణంగా చంప బడ్డారు, కొందరు బందీలుగా చిక్కారు. ఢిల్లీలోని శిల్పులు సమర్కండ్‌కు పంప బడి, అక్కడ తీమూర్ తయారుచేసిన పథ కాన్నిబట్టి జుమ్మామసీదు నిర్మించారు.

తీమూర్ ఇండియాలో ఉండి పోదలచ లేదు. ఢిల్లీలో 15 రోజులుండి తిరిగివెళ్ళి పోతూ అతను ఫీరూజాబాద్‌నూ (1399 జనవరి 1), మీరట్‌నూ (జనవరి 9), హరి ద్వారం వద్ద రెండు హిందూ సేనలనూ, సివాలిక్ కొండల వెంబడి కాంగ్రానూ (జన వరి 16) జయించి, జమ్మూను కొల్లగొట్టి అసంఖ్యాకులను హత్య చేయించాడు. ముల్తాన్, లాహోర్, దీపాల్పూర్‌లు ఏల టానికి ఖిజ్‌ఖాన్ సయ్యిద్ అనే వాణ్ణి నియో గించి అతను మార్చి 19 న సింధూ నదిని తిరిగి ఉత్తరించాడు. అతను భారతదేశానికి చేసిన హాని పూర్వం ఏ శత్రువూ ఒక్క దండయాత్రలో చేసి ఉండలేదట.

తీమూర్ దాడి వెంబడి ఢిల్లీ నగరం కరువు కాటకాల వాత పడింది. అక్కడ మిగిలిన పౌరులు కూడా చచ్చారు. రెండు నెల్లపాటు నగరం మీద పక్షి ఎగరలేదట. అసలే క్షీణించి ఉన్న ఢిల్లీ సామ్రాజ్యాన్ని తీమూర్ పూర్తిగా మట్టుబెట్టాడు. 1399లో నుస్రత్ షా సుల్తాను కావాలని యత్నిం చాడు గాని మల్లూ ఇక్బాల్ అతన్ని తరిమి కొట్టాడు. 1401 లో మల్లూ ఢిల్లీకి వచ్చాడు, అతను మహమ్మద్ షాను కూడా ఢిల్లీకి ఆహ్వానించాడు. 1405 నవంబరు 12 న మల్లూ ఇక్బాల్ ఖిజ్‌ఖాన్‌తో పోరి చనిపోగా మహమ్మద్ తిరిగి సుల్తా నయ్యాడు. సుమారు 20 ఏళ్ళు నామ మాత్రపు సుల్తా నుగా ఉండి అతను 1413 ఫిబ్రవరిలో చనిపోవటంతో తుఘ్లక్‌వంశ మంతరించింది.





# మహాభారతం

తరవాత వ్యాసుడు ఆ చనిపోయిన వారిని వెళ్ళిపొమ్మని చెప్పాడు. మృతులందరు తాము ఏయే వాహనాలూ, రథాలూ ఎక్కి వచ్చారో, వాటి మీదనే తిరిగి గంగాజలంలో ప్రవేశించి, అక్కడి నుండి తమ తమ లోకాలకు చేరుకున్నారు.

వ్యాసుడు స్త్రీల కేసి తిరిగి, "మీలో ఎవరైనా మీ భర్తల వెంట వారి లోకాలకు వెళ్ళ దలిస్తే ఈ గంగలో దిగండి," అన్నాడు. ధృతరాష్ట్రుడి కోడళ్ళు తమ మామ యొక్క సెలవు పొంది గంగలో దిగారు. వారు తమ శరీరాలను గంగలో వదిలి దివ్య శరీరాలతో భర్తలను చేరుకున్నారు. ఆ యోధులు తమ భార్యలను విమానాల పై ఎక్కించుకుని తాముండే లోకాలకు వెళ్ళిపోయారు.

తరవాత ధృతరాష్ట్రుడు మిగిలిన వారందరి వెంటా తన ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. ధర్మరాజును తిరిగి పోయి రాజ్యం చూసుకోమని చెప్పమని ధృతరాష్ట్రుడికి వ్యాసుడు చెప్పాడు. ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో, "నాయనా, ఇక మీరంతా తిరిగి వెళ్ళండి. మీరుంటే మా తపస్సు సాగదు. నేను హస్తినాపురంలోనే ఉన్నట్టుగా సుఖంగా ఉంటాను," అన్నాడు.

ధర్మరాజు ధృతరాష్ట్రుణ్ణి విడిచి వెళ్ళటానికీ, ముఖ్యంగా కుంతిని విడిచి వెళ్ళటానికీ చాలా బాధపడ్డాడు. కాని కుంతి కూడా వెళ్లిపొమ్మని చెప్పిన మీదట ఆయన అంతఃపుర స్త్రీలనూ, పరివారాన్నీ వెంట బెట్టుకుని హస్తినాపురానికి తిరిగి వచ్చాడు.

ధృతరాష్ట్రుడు వనవాసానికి వెళ్ళిన మూడేళ్ళకు ఒకనాడు నారద మహాముని ధర్మరాజును చూడ వచ్చాడు. ధర్మరాజు ఆయనకు తగిన మర్యాదలు చేసి, కుశల ప్రశ్నలడిగాడు.

అట్ట చివరి బొమ్మ




"నిన్ను చూసి చాలా కాలమయింది. తపోవనం నుంచి బయలుదేరి తీర్థాలు చూసుకుంటూ నీ దగ్గిరికి వచ్చాను," అన్నాడు నారదుడు.

"గంగాతీరవాసులు కొందరు నాతో ధృతరాష్ట్రుడు తీవ్రమైన తపస్సు చేస్తున్నాడని చెప్పారు. మీరాయనను చూశారా? ఆయనకు క్షేమమా? గాంధారీ, కుంతీ, సంజయుడూ ఎలా ఉన్నారు? తెలిస్తే చెప్పండి," అన్నాడు ధర్మరాజు.

"ధర్మరాజా, జరిగిన వృత్తాంత మంతా చెబుతాను, స్థిరచిత్తంతో విను. మీరందరూ వచ్చి వెళ్ళిన తరవాత ధృతరాష్ట్రుడు కుంతీ గాంధారీ సంజయులతో సహా గంగా ద్వారానికి బయలుదేరి వెళ్ళాడు. ఆయన చేత అగ్నిహోత్రం చేయించే బ్రాహ్మణులు కూడా అగ్నిహోత్రాలను తీసుకుని ఆయన వెంట వెళ్ళారు. అక్కడ నీ పెత్తండ్రి ఆరు మాసాలపాటు మౌనం ధరించి వాయుభక్షణ చేస్తూ, తీవ్రమైన తపస్సు చేసి, అక్కడి మునుల నందరినీ ఆశ్చర్య పరిచాడు. ఆయన శరీరంలో ఎముకలు తప్ప ఏమీ మిగల లేదు. గాంధారి జలాహారం తీసుకున్నది. కుంతి మాసోపవాసం చేసింది. సంజయుడు ఆరవ జామున మాత్రమే ఆహారం తీసుకుంటూ వచ్చాడు. ఇలా ఉండగా ధృతరాష్ట్రుడు ఇతరులతో ప్రసక్తి లేకుండా అరణ్యం వెంటపడి తిరగసాగాడు. గాంధారీ, కుంతీ ఆయన వెంట వెళ్ళారు. సంజయుడు ఆయనను పట్టుకుని నడిపించాడు. కుంతి గాంధారిని నడిపించింది. తరవాత ఒక రోజున వారందరూ గంగలో స్నానం చేసి ఆశ్రమానికి తిరిగి వస్తూండగా, పెద్ద గాలి సాగి, కార్చిచ్చు అరణ్యమంతటా చుట్టు వేసింది. అసలే తిండీ, బలమూ లేకుండా ఉన్న ధృతరాష్ట్రుడు నడవలేక పోయాడు. గాంధారీ, కుంతీ కూడా చాలా

నీరసించి ఉన్నారు. కార్చిచ్చు తమను సమీపిస్తూండటం గ్రహించి ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి కార్చిచ్చు నుంచి తప్పించుకుని వెళ్ళి పొమ్మన్నాడు. ధృతరాష్ట్రుణ్ణీ, గాంధారినీ, కుంతినీ అగ్ని పాలిటికి వదిలేసి తాను ప్రాణాలు దక్కించుకోవటం సంజయుడికి సమ్మతం కాలేదు; వారిని అగ్ని నుంచి కాపాడే ఉపాయమూ తోచలేదు. అప్పుడు ధృతరాష్ట్రుడు తమలాటి తాపసులు వాయుజలాగ్నులలో దేని చేతనైనా ప్రాణం విడవ వచ్చునని చెప్పి, సంజయుణ్ణి తక్షణమే వెళ్ళి పొమ్మన్నాడు. ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ తూర్పు దిక్కుగా తిరిగి కూర్చున్నారు. సంజయుడు వారికి ప్రదక్షిణం చేసి తాను అక్కడి నుంచి ప్రాణాలతో బయటపడ్డాడు. అతను గంగా తీరవాసులకు జరిగినదంతా చెప్పి హిమాలయానికి వెళ్ళిపోయాడు. ఆ విధంగా ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ ఆ కార్చిచ్చులో కాలి చనిపోయారు. దగ్గమైన వారి కళేబరాలను కూడా నేను చూశాను," అని నారదుడు చెప్పాడు.

పాండవులు ఈ దుర్వార్త విని పెద్ద పెట్టున శోకించారు. అంతఃపురమంతా రోదనంతో నిండిపోయింది.




ధర్మరాజు తన దుఃఖాన్ని కొంత దిగమింగుకుంటూ, "అంతటి కఠోర తపస్సు చేసీ, మేమందరమూ కలిగి ఉండి కూడా మా పెత్తండ్రి ఇంత అసహాయపు చావు చచ్చాడా? కొడుకుల నందరినీ పోగొట్టుకుని కుమిలిపోయే గాంధారి చావుకూడా నన్నంతగా బాధించదు. మా ఐశ్వర్యంతో తులతూగుతూ మమ్మల్ని చూసి ఆనందించవలసిన కుంతి ఇలా చచ్చిపోయిందే! ఛీ, ఛీ! ఈ రాజ్యమెందుకు? పరాక్రమ మెందుకు? ఏనాడో చచ్చిపోవలసిన వాళ్ళం ఇంకా బతికి ఉన్నాం. కాలగతి తెలియదు గద!



21

లేకపోతే పాండవుల తల్లి ఏమిటి? కార్చిచ్చులో పడి చనిపోవటమేమిటి? అగ్ని దేవుడికి మా అర్జునుడు ఖాండవదహనమప్పుడు చేసిన సహాయం నిరర్థకమయింది. అగ్ని ఎంత కృతఘ్నుడు కాకపోతే అతడి తల్లిని దహిస్తాడు?" అన్నాడు.

నారదుడు మరొక విషయం బయట పెట్టాడు. ఆయన ధర్మరాజుతో, "ధృతరాష్ట్రుణ్ణి దహించినది మామూలు అగ్ని కాదు. ఆయన వాయుభక్షకుడై తపస్సు చేసి యజ్ఞం చేసి, అగ్నులను విడిచాడట. అగ్నిహోత్రం చేసే యాజకులు ఆ అగ్నులను నిర్జనారణ్యంలో వదిలి వెళ్ళిపోయారట. ఆ అగ్నుల చేతనే అరణ్యం అంటుకుని, గాలి వల్ల పెద్ద కార్చిచ్చుగా మారి వాళ్ళను దహించి వేసిందట. ఈ విషయం మునులు చెప్పారు. అందుచేత ధృతరాష్ట్రుడు తన అగ్ని చేతనే దగ్ధుడై ఉత్తమ లోకాలు పొందాడు. ఇక నీవూ, నీ తమ్ముళ్ళు వారికి జలతర్పణాలు విడవండి." అన్నాడు.

తరవాత ధర్మరాజు ఒంటి బట్టతో, తమ్ములతో కలిసి, పౌరులు వెంట రాగా గంగానదికి వెళ్ళాడు. అక్కడ యుయుత్సుడితో సహా ఆయన ధృతరాష్ట్రుడికీ, గాంధారికీ, కుంతికీ శాస్త్రోక్తంగా జలక్రియలు చేసి, శౌచవిధి అవలంబించి నగరం వెలపలనే ఉంటూ, ధృతరాష్ట్రుడు మొదలైన వారు దగ్ధులైన చోటికి తెలిసినవారిని పంపి, అక్కడ చేయదగిన పనులు చేయించి, పన్నెండవరోజు శ్రాద్ధక్రియ జరిపి, ధృతరాష్ట్రుడి పేర బంగారమూ, వెండీ, ఆవులూ, మంచాలూ, డబ్బూ దానం చేశాడు. అలాగే గాంధారి పేరా, కుంతి పేరా గొప్ప దానాలు చేశాడు. తరవాత ధర్మరాజు హస్తినాపురం ప్రవేశించాడు. గంగాద్వారానికి పంపబడిన వారు తిరిగి వచ్చి అక్కడ జరగవలసిన విధులన్నీ సక్రమంగా జరిగాయని చెప్పారు.

ధర్మరాజు చేత ఈ కర్మకాండ అంతా దగ్గిర ఉండి చేయించిన నారదుడు వెళ్ళిపోయాడు.






## 31

[ అడవి మనుషుల సాయం వల్ల కేశవుడూ అతడి అనుచరులు బంధ విముక్తులైయ్యారు. తరవాత వాళ్ళు రెక్కల మనుషుల గుడారాలకు నిప్పుపెట్టి, అప్పుడు రేగిన గందరగోళంలో, పారిపోసాగారు. కాని, వాళ్ళను శత్రువులు మొసళ్ళ మడుగు వద్ద అటకాయించారు. బిడాలీ, శ్వానకర్ణీ కేశవుడి కోసం కేకలు పెట్ట సాగారు. తరవాత—]

కేశవుడి అనుచరులను రక్షించ వచ్చిన యిద్దరు అడవి మనుషులూ, తమ నాయకులు పెట్టే కేకలు విని ఎంతో ధైర్యం తెచ్చుకున్నారు. ఒకటి రెండు నిమిషాల కాలం రెక్కల మనుషుల చేతికి చిక్కకుండా పోరాడగలిగితే, ఆ తరవాత తమ జాతి వాళ్ళ సాయం వస్తుందని వాళ్ళకు నమ్మకం కలిగింది. కేశవుడూ, జయమల్లు కూడా పరిస్థితి గ్రహించి, ఎక్కడలేని ధైర్యం తెచ్చుకున్నారు. వాళ్ళు కోయగోమాంగ్‌ను ఉత్సాహపరుస్తూ, రెక్కల మనుషులను మొసళ్ళ మడుగులోకి నెట్టసాగారు. ఇంతలో గోమాంగ్ కింద పడివున్న ఈటె నొకదాన్ని చేతికి తీసుకుని, దానితో రెక్కల మనుషుల్ని పొడుస్తూ, " కేశవా, యిక మనకు ప్రమాదం లేదు. ఆయుధం దొరికింది. మీరు కూడా ఈ దుర్మార్గులతో కుస్తీపట్లు మాని ఆయుధాలు తీసుకోండి," అని అరిచాడు.



గోమాంగ్ చేత ఈటె దెబ్బలు తిన్న రెక్కల మనుషులు కీచుమని అరుస్తూ మొసళ్ళ మడుగులో పడసాగారు. అది చూస్తూనే మిగిలిన వాళ్ళు అక్కడి నుంచి కాలిబలం కొద్దీ పరిగెత్తుతూ, "పులుగు రాయా! ప్రమాదం. గుహవాసులు వందల వేల సంఖ్యలో మన మీది కొస్తున్నారు," అని కేకలుపెట్టారు. ఆ హెచ్చరిక వింటూనే ఎక్కడెక్కడ వున్న రెక్కల మనుషులూ ఆ ప్రాంతం వదిలి అడవి కేసి బయలు దేరారు. తన అనుచరులను ప్రోత్సహించి, అడవి మనుషులతో యుద్ధానికి పూను కోవటం సాధ్యంకాదని పులుగురాయుడు గ్రహించాడు. కాని, ఒకసారి అడవి మనుషులకు వెన్నుచూపితే, ఆ తరవాత వాళ్ళు తనను, పిరికిపంద కింద జమకట్టే ప్రమాదం వున్నది. ఇప్పు డేమి చేయటం?

పులుగురాయుడి తటపటాయింపు గ్రహించిన బ్రహ్మదండి మాంత్రికుడు మంత్రదండాన్ని పైకెత్తి, "జై కాలభైరవా!" అంటూ పెద్దగా ఒక కేక పెట్టి, "పులుగు ప్రభో! యిది మనకు కష్టకాలం. గ్రహాలు వికటించినై. కాలభైరవుడు ఎందుకనో ఆగ్రహించాడు. ప్రస్తుతానికి మనం చేయగలిగిందేమీ లేదు. ఆ గుహవాసులూ, జయమల్లు ముతా వచ్చి మన మీద పడకముందే, అడవిలోకి తిరోగమిద్దాం," అన్నాడు.

"మాంత్రికా, అదే నేనూ అనుకుంటున్నాను. మా గరుడజాతి వాళ్ళకు రాత్రిళ్ళు బొత్తిగా కళ్ళు కనిపించవు. సూర్యోదయం కానివ్వండి, మా ధాటి చూపెడతాం," అంటూ పులుగురాయుడు బయలుదేరాడు. అంతలో జిత, శక్తివర్మలు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళ చేతుల్లో వున్న కత్తులు సగం విరిగి వున్నాయి. వాళ్ళ దేహాలు రక్తంతో తడిసి వున్నాయి.

జిత, శక్తివర్మలను చూస్తూనే బ్రహ్మదండికి ప్రాణం లేచి వచ్చినట్టయింది.



అతడు వాళ్ళను సమీపించి, "జితా, శక్తీ! మీరు యింకా బతికే వున్నారా? ఆ దుర్మార్గులు మీ యిద్దర్నీ హత్య చేశారనుకున్నాను," అన్నాడు.

"వాళ్ళా ... మమ్మల్నా ... హత్యా!" అంటూ జితవర్మ పెద్దగా నవ్వి, "మా మొండికత్తులు చూడు, నెత్తురులో స్నానమాడిన మా శరీరాలు చూడు! ఎంత మంది శత్రువుల్ని చంపామో మాకే తెలీదు. కత్తులు విరిగిపోవటంతో వెనుదిరిగి యిటు పురోగమించి రావలసివచ్చింది," అన్నాడు.

జితవర్మ మాటలకు స్థూలకాయుడు విరగబడి నవ్వుతూ, "మీ యిద్దర్లో ఏ ఒకడూ శత్రువులను చూశామని చెప్పినా నేను నమ్మను. ఇంతసేపూ ఏ చెట్టుకొమ్మల్లోనో దాక్కుని వుంటారు!" అన్నాడు.

స్థూలకాయుడి మీదికి జిత శక్తివర్మలు తమ మొండికత్తుల్ని ఎత్తేంతలో, పులుగురాయుడు వాళ్ళను కసురుతూ, "ఛీ, యిక వూరుకోండి. మీ నుంచే నా రాజ్యానికి యింత ప్రమాదం వచ్చింది. మీ కాపలాలో వున్న ఆ దుర్మార్గులు ఎలా తప్పించుకుపోగలిగారు? ఆ సంగతేదో యిక్కడే తేలాలి. మిమ్మల్ని రాకాసిపక్షిమాతకు బలిచేస్తాను," అంటూ ఈటెను వాళ్ళ మీదికి ఎత్తాడు.



అంతలో గుహావాసులు అటుకేసి వస్తున్న సూచనగా కేకలు వినబడినై. బ్రహ్మదండి మాంత్రికుడు, పులుగురాయుడి చేయి పట్టుకుని, "పులుగుదేవా! మీరు శాంతించండి. ఆ అడవిమనుషుల దండు యిటే వస్తున్నది. ముందు మనం యిక్కణ్ణించి పారిపోకపోతే ప్రమాదం," అన్నాడు.

బ్రహ్మదండి మాట ముగించే లోపలే పులుగురాయుడు అడవి కేసి పరుగులంకించుకున్నాడు. స్థూలకాయుడూ, బ్రహ్మదండి మాంత్రికుడూ, జిత, శక్తివర్మలు కూడా అతడి వెనక పరిగెత్తారు. జితవర్మ శక్తివర్మతో, "శక్తీ, చూశావా? మనం



శత్రువులను చీల్చి చండాడేందుగ్గాను కనబరిచిన శూరవీరత్వం, సాహసధైర్యాలూ ఎందుక్కొరగాకుండా పోయినై. ఆ పిట్టతల వెధవా, బ్రహ్మదండీ కూడా మన దర్పబల శౌర్యాలను శంకిస్తున్నారు," అన్నాడు.

"వాళ్ళిద్దరే శంకించటమేం! ఈ మాంసం పోగు కూడా మనను అపహాస్యం పట్టిస్తున్నాడు. ఇప్పుడు మన కత్తులు మొండివయిపోయినై. మంచి కత్తులు సంపాయించగానే ఈ అందర్నీ కట్టకట్టి నిలువునా నరికేద్దాం," అన్నాడు శక్తివర్మ.

అంతలో వాళ్ళకు "బిడాలికీ జై!" అన్న కేకలూ, రివ్వురివ్వు మంటూ మీదికి వచ్చిపడే ఈటెలూ ప్రత్యక్షమయినై. "మరి కొంచెం వేగంగా పరిగెత్తండి. శత్రువులు మనను చూసినట్టుంది. జితా, శక్తీ! మీ చచ్చు సంభాషణ కట్టిపెట్టి, నోళ్ళు మూయండి!" అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు లేడిలా ఛంగున ముందు కురికాడు.

కేశవుడు తన అనుచరులనూ, బిడాలీ, శ్వానకర్ణి ముఠా వాళ్ళనూ వెంటపెట్టుకుని వచ్చి, పులుగురాయుడు నివశించే గుడారాల ప్రాంతాన్ని చుట్టుముట్టే సరికి, అక్కడ వారికి రెక్కల మనుషు లెవరూ కనిపించ లేదు. ఆ దుర్మార్గులు ప్రమాదం శంకించి అడవి కేసి పారిపోయి వుంటారని కేశవుడూ, జయమల్లూ నిశ్చయించుకున్నారు. కాని, చీకటిలో వాళ్ళను వెంబడించి చుట్టుముట్టటం సాధ్యమయేది కాదు. ఆ కారణం వల్ల కేశవుడు గుహవాసులను చిన్నచిన్న ముఠాలుగా అడవి ప్రాంతానికి వెళ్ళి, కనబడిన రెక్కల మనుషులను హతమార్చమన్నాడు. అలా బయలుదేరిన ఒక ముఠా చేతిలో పడవలసిన బ్రహ్మదండీ, పులుగురాయుడూ అదృష్టవశాన తప్పుకుని అడవిలోకి పారిపోగలిగారు.

రాత్రి గడిచి సూర్యోదయం అయేవరకూ కేశవుడూ అతడి అనుచరులు కాలుతున్న

పులుగురాయుడి గుడారాల ప్రాంతాలనే కాలం గడిపారు. రెక్కల మనుషులు చెట్ల మీది నుంచి కిందికి దూకేందుకు ఉపయోగించే పక్షిరెక్కలు వాళ్ళకు ఒకచోట గుట్టలు గుట్టలుగా కనిపించినై. వాటిని చూడగానే బిడాలికీ, శ్వానకర్ణికీ యింతకాలంగా వాళ్ళు చేసిన మోసం తెలిసిపోయింది.

"నిజంగా వాళ్ళు రెక్కలున్న మనుషులని మేం నమ్మాం. వాళ్ళు పక్షుల్లా ఆకాశంలోకి ఎగరగలరని కూడా మేం భావించాం. అంతా మోసం!" అన్నాడు బిడాలి.

"ఆ మోసమేదో యిప్పుడు తెలిసిపోయింది. ఇక ఆ నీచుల్ని అడవిబాతుల్ని వేటాడినట్టు వేటాడతాం. వాళ్ళు వర్థి పిరికి పందలు కూడా. వాళ్ళ ధైర్యం ఏపాటిదో కూడా యింతకు ముందు తేలిపోయింది," అన్నాడు శ్వానకర్ణి.

గుహావాసుల నాయకులిద్దరికీ కలిగిన ఆత్మవిశ్వాసం చూసి, కేశవుడూ, జయమల్లూ చాలా సంతోషించారు. సూర్యోదయమై నాలుగుబారల పొద్దెక్కగానే, కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్‌ల గౌరవార్థం; బిడాలీ, శ్వానకర్ణీ గొప్ప విందు ఏర్పాటు చేశారు.

ఆ విందు జరిగేటప్పుడు ఆటలూ పాటలూ సాగినై. యువకులైన గుహావాసులు






మల్ల యుద్ధాలూ, ఈటెలతో రకరకాల వ్యాయామాలూ చేశారు.

విందు మధ్య జయమల్లు బిడాలికీ, శ్వానకర్ణికీ ఒక సలహా యిచ్చాడు. రెక్కల మనుషుల ప్రమాదం యిక లేదు గనక, వాళ్ళిద్దర్నీ తమ తమ ముఠాలతో కొండ గుహలు వదిలి వచ్చి, సమతలంగా వున్న ఆ ప్రాంతాల విశాలమైన గృహాలు నిర్మించుకో మన్నాడు.

ఈ సలహాకు శ్వానకర్ణి అనంగీకార సూచకంగా తల వూపి, "మేము మా తాత ముత్తాతలకు పూర్వం నుంచి కూడా గుహల్లోనే కాలం గడుపుతున్నాం. ఇప్పుడు ఆ ఆచారం వదిలి, ఈ చెట్ల కింద ఎలా నివశించటం?" అన్నాడు. బిడాలి కూడా అదే అభిప్రాయం వెలిబుచ్చాడు.

జయమల్లు చిరునవ్వు నవ్వి, "అయితే, ఒక పని చెయ్యండి. ఒకేసారి అందరూ గుహలు వదిలి రాకుండా, మీలో కనీసం యువతరం వాళ్ళనైనా యిక్కడ నివశించేలా చేయండి. గుహల్లో వుండటంకన్నా, యిక్కడ వెలుగూ, గాలీ వున్న ప్రాంతాల నివశించటం ఆరోగ్యకరం అని తేలితే, మిగతా వాళ్ళు కూడా ఆ తరవాత యిక్కడికి రావచ్చు. ఏది ఏమైనా, ఆ రెక్కల మనుషుల్ని మాత్రం తిరిగి యిక్కడికి వచ్చి గుడారాలు కట్ట కుండా చూడండి. ఈ ప్రాంతం మంచినీటి సమృద్ధీ, ఆహార సమృద్ధీ కలది," అన్నాడు.

"ఆ రెక్కల మనుషుల్ని గురించిన భయం మా కేమీ లేదు. మీ సహాయం వల్ల నేను మా మూల పురుషుడి మహత్తర శక్తులు గల గద సంపాయించుకున్నాను. బిడాలికీ నాకూ మధ్య యిప్పుడు శత్రుత్వమేమీ లేదు, మేము మిత్రులం. మా రెండు ముఠాలకూ మీరు చేసిన మేలు మరువ రానిది. మా నుంచి మీ కెలాంటి సహాయం కావాలో అడగండి. ఎంత కష్టసాధ్యమైన

దైనా చేయగలం," అన్నాడు శ్వానకర్ణి. శ్వానకర్ణి మాటలకు అంగీకార సూచకంగా బిడాలి తల వూపాడు.

జయమల్లు తన అనుచరు లిద్దరి కేసి ఓమారు చూసి, తరవాత బిడాలీ, శ్వానకర్ణులతో, "మీరు, కోరితే మా కెలాంటి సహాయమైనా చేస్తారని మాకు తెలుసు. మేము రాకాసిలోయకు వెళ్ళాలి. అక్కడికి వెళ్ళి తిరిగివచ్చిన వారెవరైనా మీలో వుంటే చెప్పండి," అన్నాడు.

జయమల్లు యిలా అనగానే బిడాలీ, శ్వానకర్ణులు ముఖముఖాలు చూసుకున్నారు. ఇద్దరి ముఖాల్లో ఆశ్చర్యం, భయం తాండవించింది. శ్వానకర్ణి గొంతు ఓమారు సవరించుకుని వూరుకున్నాడు. బిడాలి తల వంచుకుని చిన్నగొంతుతో, "ఆ రాకాసి లోయకు వెళ్ళివచ్చిన వాళ్ళెవరూ, మా తరం వాళ్ళలో బతికి లేరు. కాని, దాన్ని గురించి విన్నాం. అది ఈ అరణ్యాల కవతల గల కొండల్లో ఒక గొప్ప లోయ. అక్కడికి చేరటం చాలా కష్టం; తిరిగి రాగలగటం అంతకన్న కష్టం. ఇంతకూ అక్కడి కెళ్ళవలసిన పని మీకేం కలిగింది?" అని ప్రశ్నించాడు.

"బిడాలీ! నీ మాటలనుపట్టి చూస్తూంటే, నీకు ఆ ప్రాంతాలకు వెళ్ళే దారి తెలుసు




నన్నట్టు కనబడుతున్నది. ఆ మార్గం ఏదో చూపించు, చాలు. ఆ లోయలో పెరిగే ఒక గొప్ప ఓషధి మాకు కావాలి. బ్రహ్మపుర రాజుకు నయంకాని వ్యాధి ఒకటి పుట్టింది. ఆ ఓషధితో ఆయన వ్యాధి కుదరగలదని రాజవైద్యులు మమ్మల్ని పంపారు," అన్నాడు జయమల్లు.

"బిడాలి చెప్పినట్టు, ఆ లోయకు వెళ్ళటం, తిరిగిరావటం కూడా అసంభవం, ఆలోచించుకోండి," అన్నాడు శ్వానకర్ణి.

"అవన్నీ ఆలోచించకుండానే, యింత దూరం వచ్చామనుకున్నావా, శ్వానకర్ణీ? మేం ఎలాంటి ప్రమాదాలనైనా ఎదుర్కో

టానికి సిద్ధంగానే వున్నాం. దారేదో మాకు చూపండి. పోతే, మీరు మాకు చేయవలసిన మరొక సహాయం; ఆ పులుగురాయుడి వెంట, బ్రహ్మదండి అనే మాంత్రికుడొకడున్నాడు. వాడు మీకు దొరికితే ప్రాణాలతో మేం తిరిగివచ్చిన దాకా బందీగా వుంచినా సరే, లేక చంపినా సరే, మా అభ్యంతరం ఏమీ లేదు," అన్నాడు జయమల్లు.

"ఓఁ ఆ సంగతి గుర్తు పెట్టుకుంటాం. మీకు రాకాసిలోయకు దారి చూపటమే కాదు, మీ వెంట నేనూ బిడాలీ కూడా వస్తాం. ఏమంటావ్ బిడాలీ?" అని అడిగాడు శ్వానకర్ణి.

బిడాలి ఎక్కడలేని ఉత్సాహం కనబరుస్తూ, "నేను పెద్దవాణ్ణయి పోయాను. నా ముఠాకు నాయకుడుగా తగిన యువకుణ్ణొకణ్ణి చూసి నియమించి, మీ వెంట రాగలను," అన్నాడు.

దీనికి కేశవుడూ, జయమల్లూ అభ్యంతరం చెప్పారు. తరవాత కొంత చర్చ జరిగిన మీదట, సూర్యాస్తమయానికి ఓ గంట ముందుగా, కేశవుణ్ణీ, జయమల్లునూ, కోయగోమాంగ్‌నూ అక్కడవున్న ఎత్తయిన పర్వత శిఖరాల మీది నుంచి, బలమైన ఊడల సాయంతో బిడాలీ, శ్వానకర్ణీ ముఠావాళ్ళు లోయలోకి దించారు.

ఆ లోయలో వున్న ఒకా నొక సారంగ మార్గం వెంటపోతే, అది రాకాసి లోయకు దారి తీయగలదని వాళ్ళు చెప్పారు.

ఊడల సాయంతో కొండశిఖరం మీది నుంచి లోయలోకి దిగిన కేశవుడూ అతడి అనుచరులకు దూరంగా డప్పులమోత వినబడింది. వాళ్ళు అటుకేసి చూశారు. గణాచారిలా జుట్టు విరబోసుకుని వున్న ఒకడు, చిందులు వేస్తూ కేకలు పెడుతున్నాడు. అతడి చేతిలో భయంకరరూపం గల ఒక పక్షి వున్నది. —(ఇంకా వుంది)





# కాకి సహాయం

టర్కీ దేశంలో పక్షులను పట్టి, వాటిని అమ్మి జీవించే యువకు డొక డుండే వాడు. ఒక నాడు వాడు ఉచ్చులు తీసుకుని అడవికి వెళ్ళి, ఒక చెట్టు పైన ఉచ్చు అమర్చి, ఆత్రంగా చూస్తూ కూర్చున్నాడు. అంతలోనే ఒక కాకి వచ్చి ఉచ్చులో చిక్కుకుంది. వాడు చెట్టెక్కి దాన్ని పట్టుకో బోతుండగా ఆ కాకి మనిషి భాషలో, "నన్ను పట్టుకోకు. నన్ను వదిలి పెట్టావంటే, నీ కొక అపూర్వమైన పక్షి దొరుకుతుంది. దాన్ని తీసుకుపోయి సుల్తాను కిస్తే నీకు అంతులేని బహుమానం దొరుకుతుంది," అన్నది.

యువకుడు కాకి మాటలు నమ్మి, దాన్ని ఉచ్చు నుంచి విడిపించి, మళ్ళీ ఉచ్చు పన్నాడు. వాడు చెట్టు దిగి వచ్చాడో లేదో ఎటునుంచో ఒక అందమైన పక్షి ఎగిరి వచ్చి, చెట్టు పైన వాలి, వాడి ఉచ్చులో చిక్కుకున్నది. దాన్ని పట్టుకోవటానికి చెట్టెక్కిన యువకుడు దాని రంగులూ, వింత అందం, పొడుగైన తోకా చూసి అమితాశ్చర్యం పొందాడు. అది కిన్నెర పక్షి. ఆ జాతి పక్షిని ఆ దేశంలో ఎవరూ ఎన్నడూ చూడ లేదు. వాడా పక్షిని పెద్ద పంజరంలో పెట్టి తీసుకుపోయి సుల్తాను ఎదట పెట్టాడు.

సుల్తాను కూడా ఆ పక్షిని చూసి అమిత ఆశ్చర్యమూ, ఆనందమూ పొంది, పక్షులు పట్టే వాడికి అంతులేని ధనం ఇచ్చాడు. తరవాత ఆయన దాని నొక బంగారు పంజరంలో ఉంచి, అహోరాత్రాలు దాని దగ్గిరే ఉంటూ, దాన్ని చూస్తూ ఆనందించసాగాడు.

సుల్తానుగారి వజీరుకు ఇదంతా చూసి ఓర్చలేని తనంతో కడుపు మండిపోయింది. ఎవడో పక్షులను పట్టుకునే అనామకుడు వచ్చి సుల్తానును ఇంతగా మెప్పించి, పెద్ద బహుమానం పుచ్చుకు పోతాడా? వాడి

టి. రాజేశ్వరరావు



కిచ్చిన డబ్బుకు గిట్టింపు అయేటట్టు చేయాలని దుష్టబుద్ధి అయిన వజీరు ఒక ఆలోచన చేశాడు.

అతను సుల్తాను వద్దకు వెళ్ళి, "ప్రభూ, ఈ పక్షి అందం చూస్తే, దానికి ఈ బంగారు పంజరం కూడా పనికి రాదనిపిస్తుంది. దాని కోసం దంతంతో చిన్న భవనం నిర్మించితే ఎంతో బాగుంటుంది," అన్నాడు.

"దాని కేమీ సందేహం లేదు గాని, అంత దంతం దొరకడ మెలాగ?" అని అడిగాడు సుల్తాను.

"పక్షిని అమ్మిన వాడే ఆ పనీ చూసు కుంటాడు," అన్నాడు వజీరు.



వజీరు యువకుణ్ణి దివాణానికి పిలిపించి, నలభై రోజులలోగా పక్షి కోసం దంతపుటిల్లు కట్టటానికి సరిపడినంత దంతం పట్టుకు రమ్మని ఆజ్ఞాపించాడు.

"అంత దంతం నే నెక్కడి నుంచి తీసుకు రాగలను?" అన్నాడు యువకుడు తెల్లబోయి.

"సుల్తాను వారి ఆజ్ఞ. ఎలా తెస్తావో నీవే ఆలోచించుకో. గడువు లోగా పని పూర్తి చెయ్యక పోయావో, నీ తల తెగిపోతుంది," అన్నాడు దుర్మార్గుడైన వజీరు.

యువకుడు పుట్టెడు దిగులు మోసుకుని, కాళ్ళీడ్చుకుంటూ రాజ భవనం వెలపలికి వచ్చి, ఎటు వెళ్ళాలో దిక్కు తెలియని వాడిలాగా నిలబడి ఉండగా, కాకి ఎటు నుంచో వచ్చి వాడి భుజం మీద వాలి, "ఎందుకా దిగులు ముఖం? ఏం వచ్చి పడింది?" అని అడిగింది.

"ఆ పక్షిని అమ్మి బోలెడంత డబ్బు సంపాదించు కున్నాను గదా అని సంతో షిస్తుంటే, సుల్తానుగారు ఆ పక్షికి ఇల్లు కట్టాలి, సరిపడినంత దంతం పట్టుకు రమ్మంటున్నాడు. నలభై రోజుల్లో తేకపోతే పీక తెగిపోతుంది. ఏం చెయ్యాలి?" అన్నాడు యువకుడు.



"నేను చెప్పినట్టు చెయ్యి, విచారించకు. సుల్తానుగారి దేవిడీకి తిరిగి వెళ్ళి, నలభై పీపాల సారా ఇప్పిస్తే దంతం తెస్తానను. ఆ సారాను బళ్ళ మీద అడవికి చేర్చు. అక్కడ ఏనుగులు నీరు తాగే మడు గున్నది. అందులోకి సారా అంతా దిమ్మరించు. ఏనుగులు వచ్చి, సారా తాగి, ఒళ్ళు తెలియకుండా పడిపోతాయి. అప్పుడు వాటి దంతాలు కోసుకుని చక్కా రా!" అని కాకి సలహా ఇచ్చింది.

యువకుడు కాకికి తన కృతజ్ఞత తెలుపుకుని, అది చెప్పినట్టే చేసి, దంతం సంపాదించి తెచ్చి సుల్తానుకు ఇచ్చాడు. అంత దంతం చూసేసరికి సుల్తాను పరమానంద భరితుడై, యువకుడికి ఇంకా గొప్ప బహుమానం ఇచ్చాడు.

తరవాత ఆయన మంచి పనివాళ్ళను పిలిపించి, పక్షి కోసం అందమైన దంత గృహం ఒకటి నిర్మింప జేశాడు.

ఇది చూసి వజీరు ముఖం ఇంకా మాడిపోయింది. పక్షులను పట్టే వాడి పరపతి ఇంకా పెరిగింది. వాణ్ణి నాశనం చెయ్యటానికి ఇంకొక మార్గం దొరికింది వజీరుకు. అతను సుల్తాను వద్దకు వెళ్ళి, "ప్రభూ! తమరు అపూర్వమైన పక్షిని సంపాదించారు.



దాని కోసం మరింత అపూర్వమైన దంత గృహం నిర్మించారు. అంతా బాగుంది, కాని ఆ పక్షి ఎందుకు పాడదో అది కాస్త ఆలోచించారా?" అన్నాడు.

"నాకూ అదే అనుమానం వచ్చింది సుమా!" అన్నాడు సుల్తాను.

"అది అడవుల్లో నివసించే పక్షి కాదు. ఎవరో పెంచిన పక్షి అని తెలుస్తూనే ఉంది. పక్షులను పట్టేవాడు పట్టి తీసుకు రాక పూర్వం దాని కొక యజమాని ఉండే ఉండాలి. ఆ యజమానిని తీసుకు వచ్చినట్టయితే ఈ పక్షి తప్పక పాడుతుందని నా నమ్మకం," అన్నాడు వజీరు.

"కాని దాని యజమాని ఎక్కడుండేదీ ఎవరికి తెలుసు?" అన్నాడు సుల్తాను.

"పక్షిని పట్టుకున్న వాడికే తెలియాలి," అన్నాడు వజీరు.

"అయితే ఈ పక్షి యజమానిని తెప్పించ గలవా?" అని సుల్తాను ఆత్రంగా అడిగాడు.

"అదంతా నాకు వదిలెయ్యండి," అన్నాడు వజీరు.

అతను యువకుడి కోసం మళ్ళీ కబురు చేసి, నలభై రోజులలోగా పక్షి యొక్క పూర్వపు యజమానిని తీసుకు రాకపోతే తల తీసేటట్టు సుల్తానుగారు ఉత్తరు విచ్చారని తెలియజేశాడు.

"దాని యజమాని ఎవరో నాకేం తెలుసు? నేను పట్టుకున్నప్పుడది అడవిలో స్వేచ్ఛగా ఎగురుతున్నది," అన్నాడు యువకుడు.

"దానికి నన్నేం చెయ్యమంటావు. సుల్తానుగారి ఉత్తరువు నీతో చెప్పాను. ధిక్కరిస్తే ఏమవుతుందో నీకూ తెలుసు," అన్నాడు వజీరు.

జారిపోయిన గుండెతో యువకుడు తన ఇంటికి వెళ్ళి మంచం మీద పడుకుని భోరుమని ఏడ్చాడు. కిటికీలో నుంచి కాకి వచ్చి అతని భుజాన వాలి, మళ్ళీ ఏమి వచ్చి పడిందని అడిగింది. యువకుడు దానితో అంతా చెప్పాడు.



"దీని కింత దిగులెందుకు? నేను చెప్పి నట్టు చెయ్యి. దివాణానికి తిరిగి వెళ్ళి, సుల్తానుగారి విహార నౌకనూ, నలభైమంది దాసీలనూ ఇయ్యమని అడుగు. ఆ నౌకలో చిన్న ఉద్యానమూ, స్నానశాలా మొదలైనవి ఉన్నాయి. దాన్ని తీసుకుని సముద్రమార్గాన పోగా, పోగా ఒక విచిత్రమైన దీవి వస్తుంది. అది సముద్రంలో నుంచి పైకి లేచిన పెద్ద కొండ లాగా ఉంటుంది. ఆ దీవి దగ్గిర నౌకకు లంగరు వేయించు. ఆ దీవిలో ఉండే వారు ఒక విధమైన దేవతా స్త్రీలు. ఆ దేవతల రాణి ఈ పక్షికి యజమాని. నీ నౌకను చూడ గానే అక్కడ ఉండే స్త్రీ లందరూ నౌకలోకి ఎక్క చూడ యత్నిస్తారు. ఒక్క రాణిని తప్ప మరెవరినీ నౌకలోకి రానివ్వకు. ఆమెకు వినోదాలు కలిగించి, ఆ వినోదాలలో ఆమె మునిగి ఉన్న సమయంలో లంగరు ఎత్తించి, నౌకను వెనక్కు తిప్పుకురా," అని కాకి సలహా ఇచ్చింది.

యువకుడు ఈ సలహా ప్రకారమే చేశాడు. అంతా కాకి చెప్పినట్టే జరిగి పోయింది. దేవతల రాణి చిన్న తెప్పలో కూచుని నౌకను చూడ వచ్చింది. నౌకలో ఉండే దాసీలు ఆమెకు మిఠాయి మొద లైనవి పెట్టి, చక్కగా స్నానం చేయించారు. ఈ మర్యాదలన్నీ ముగిసి రాణి నౌక పైకి





వచ్చేసరికి దీవి జాడ కూడా లేదు; నౌక వేగంతో ప్రయాణిస్తున్నది.

తన కెవరో ద్రోహం తలపెట్టారని రాణి భయపడింది. కాని యువకు డామెతో, "మీ కేమీ భయం లేదు. ఒక చిన్న పని కలిగి మిమ్మల్ని మా సుల్తానుగారి దగ్గిరికి తీసుకు పోతున్నాను. అంతకంటె ఏమీ లేదు," అని ఎంతో వినయంగా మనవి చేసుకున్నాడు.

కాలక్రమాన నౌక స్వదేశానికి తిరిగి వచ్చింది. యువకుడు రాణిని వెంట బెట్టు కుని సుల్తాను వద్దకు వచ్చాడు. నౌక వచ్చి చేరిందన్న వార్త తెలియగానే సుల్తాను పక్షి ఉన్న దంతం భవనం పక్కనే సింహాసనం వేయించుకుని, వజీవరూ యితర పరి వారంతో సిద్ధంగా ఉన్నాడు.

రాణి యువకుడి వెంట లోపలికి అడుగు పెడుతూండగానే కిన్నెర పక్షి కంఠమెత్తి అత్యద్భుతంగా గానం చెయ్యసాగింది. ప్రతి ఒక్కరూ ఆ గానంలో తన్మయత్వం చెంది పోయారు. అందరి కన్న ఎక్కువ తన్మ యత్వం చెందిన దేవతల రాణి తన భయా లన్నిటినీ మరచి పోయింది. సుల్తాను ఆనందం మాట చెప్పనే అవసరంలేదు. ఆయన పక్షి పాటకే ఎక్కువ ముగ్ధు డయాడో, రాణి సౌందర్యానికే ఎక్కువ ముగ్ధుడయాడో ఆయనకే తెలియదు. ఆమెను తన సరసను కూర్చోబెట్టుకుని తన జన్మ చరితార్థ మయినట్టు భావించాడు.

ఆయన కోరికపై రాణి సుల్తానును పెళ్ళాడటానికి సమ్మతించింది. మర్నాడే వివాహమూ, విందూ జరిగాయి. దేశంలో ఉండే బాధలన్నీ ఉండటానికి చోటు లేక వజీరు హృదయంలో దాక్కున్నట్టయింది. ఇంకేమి దుర్మార్గం తలపెట్టాలో అతనికి తోచిందికాదు.

కొంత కాలం గడిచింది. సుల్తానాకు జబ్బు చేసింది. ఆస్థాన వైద్యులందరూ

చికిత్స చెయ్య యత్నించారు. కాని వ్యాధి తిరుగుముఖం కాలేదు.

సుల్తానుతో వైద్యులు, "ఈమె సాధారణ మానవ స్త్రీ కాదు. అందుచేత మన మందులు పనిచెయ్యవు. ఆమె ఉండే చోటి నుంచి ఏదైనా ఔషధం తీసుకు వస్తేనే గాని ఈ వ్యాధి నయంకాదు," అన్నారు.

వెంటనే వజీరు, "పక్షులు పట్టేవా డున్నాడు గద. వాణ్ణి వెళ్ళి మందు తీసుకు రానివ్వండి," అన్నాడు.

యువకుడు విహార నౌకలో దేవతల దీవికి మరొకమారు ప్రయాణమై వెళ్ళాడు. ఈసారి నౌకను చూడటానికి ఎవరూ రాలేదు. యువకుడు శ్రమపడి తానే కొండ పైకి ఎక్కవలసి వచ్చింది. తీరా అతను రాజ భవనాన్ని సమీపించే సరికి, దాని ద్వారం వద్ద రెండు సింహాలు కూర్చుని ఉన్నాయి. అవి కొత్తవాణ్ణి చూసి కోరలు బయట పెట్టి, భీకరంగా గర్జించసాగాయి.

యువకుడు భయంతో తాను నిలబడ్డ చోటనే స్తంభించి పోయాడు. ముందుకు అడుగువేస్తే సింహాలు తనను చీల్చేస్తాయి. వెనక్కు పోతే సుల్తానా వ్యాధితో మరణించటమూ, సుల్తాను గుండె పగిలి చావటమూ అటుంచి, తనకు శిరశ్ఛేదం తప్పదు.



అందుచేత ఏమి చెయ్యటానికీ పాలుబోక యువకుడు నిలబడి ఉండగా, ఎక్కడి నుంచో కాకి ఎగిరి వచ్చి, అతని భుజం మీద వాలి, "ఏమయింది? ఎందుకలా వణికిపోతున్నావు?" అని అడిగింది. యువకుడు తన సమస్య చెప్పుకున్నాడు.

"నా యీక ఒకటి తీసుకుని చేత పట్టుకుని నడు, దానితో సింహాలను దువ్వు; అవి నిన్నేమీ చెయ్యవు," అన్నది కాకి.

యువకుడు కాకి యీక తీసుకుని అది చెప్పినట్టే చేసి రాజభవనంలోకి వెళ్ళాడు. దేవతా స్త్రీ లందరూ అతని చుట్టూ మూగి, తమ రాణి వ్యాధిని గురించి వింటూనే

అతనికి ఔషధం ఒకటి ఇచ్చారు. దాన్ని తీసుకుని వాడు వెంటనే బయలుదేరి స్వదేశానికి తిరిగి వచ్చాడు.

వాడి కోసం ఎదురు చూస్తున్న సుల్తాను వాణ్ణి వెంటపెట్టుకుని మరణావస్థలో ఉన్న సుల్తానా దగ్గిరికి తీసుకు వెళ్ళాడు. ఆ సమయంలో కాకి కిటికీ కుండా ఎగిరి వచ్చి యువకుడి భుజం మీద వాలింది.

ఔషధం బొట్లు కంఠం దిగుతూనే సుల్తానా కళ్ళు తెరిచి, యువకుడి భుజం మీద వాలి ఉన్న కాకిని చూసి, "నువ్వే నులే, సోమరిపోతు ముండా!" అన్నది.

కాకి ఆ మాటలకు భయపడ్డట్టు కనిపించింది.

"నాకు తెలుసులే, ఈ కుర్రవాణ్ణి హతమార్చటానికి సృష్టించిన పనులన్నిటిలోనూ నీవు వీడికి సహాయపడ్డావు. ఇప్పుడు నా ప్రాణం కాపాడావు కూడానూ," అని సుల్తానా కాకితో అన్నది.

ఆమె ఇప్పుడు ఎప్పటి ఆరోగ్యాన్ని పొంది పక్క మీద లేచి కూర్చున్నది.

"మనకూ ఈ కాకికీ ఏమి సంబంధం?" అని సుల్తాను తన భార్యనడిగాడు.

"అది నా దాసీది. నాకు సరిగా పని చేయక పోయేసరికి శిక్ష కింద కాకిగా మార్చేశాను. ఇప్పుడు దాన్ని క్షమిస్తున్నాను," అన్నది సుల్తానా.

ఆమె ఆ మాట అంటూండగానే కాకి కాస్తా అదృశ్యమై, దాని స్థానంలో ఒక అందమైన కన్య ప్రత్యక్షమయింది. ఆమెను చూడగానే యువకుడి గుండె వేగంగా కొట్టుకున్నది. సుల్తాను, సుల్తానాల అనుమతితో వారిద్దరూ వివాహం చేసుకున్నారు.

యువకుడి అదృష్టం అంతటితో ఆగలేదు. సుల్తాను తన వజీరు ద్రోహ బుద్ధి తెలుసుకుని, అతణ్ణి దూర దేశాలకు పంపేసి, ఈ యువకుణ్ణి తన వజీరుగా చేసుకున్నాడు.





# ఖలీఫాల సంపద

మన దేశంలో అక్బరు ఆస్థానంలో ఉండిన తాన్‌సేన్ లాగే, హరూన్ అల్‌రషీద్ ఆస్థానంలో ఇషాక్ అల్‌నదీమ్ అనే సాటిలేని మేటి గాయకుడుండే వాడు. అతన్ని సంగీత సరస్వతీ అవతారంగా పరిగణించేవారు. అతని జన్మస్థలం మోసుల్. ఖలీఫా అతన్ని ప్రాణ మిత్రుడులాగా చూసుకునేవాడు. ఆయన అతనికి తన రాజభవనాలలో అందమైనది ఒకటి ఇచ్చి, దివాణపు దాసీలకు జంత్రగాత్ర సంగీతాలు నేర్పమని అతన్ని నియోగించాడు. ఆ దాసీలలో ఎవతె అయినా కిన్నెర వాద్యంలోగాని, గానంలో గాని ప్రావీణ్యం సంపాదించగానే ఇషాక్ ఆమెను ఖలీఫా సమక్షంలో పాడించేవాడు. ఆమె ప్రావీణ్యం ఖలీఫాకు నచ్చినట్టయితే ఆమె ఆయన అంతఃపురానికి పంపబడేది; నచ్చని పక్షంలో ఇషాక్ భవనానికి తిరిగి వచ్చి మరికొంత శిక్షణ పొందేది.

ఒకనాడు ఖలీఫా, మనస్సు వికలంగా ఉండి, తన మంత్రి అయిన జాఫర్‌నూ, ఇషాక్‌నూ, తన వేత్రహస్తుడైన మస్రూర్‌నూ, యూనుస్ అనే రాజలేఖకుణ్ణీ పిలిపించాడు. వారు వచ్చేసరికి ఖలీఫా సామాన్య పౌరుడి దుస్తులు ధరించి ఉన్నాడు. అలాటి దుస్తులే ధరించమని ఆయన వారిని కూడా ఆజ్ఞాపించాడు. అందరూ దుస్తులు మార్చుకుని, రహస్యంగా రాజభవనాల నుంచి బయటికి వచ్చి, చిన్నపడవలో ఎక్కి తిగ్రిస్ నదిపైన అల్తాఫ్ అనే చోటికి చేరుకుని, అక్కడ పడవ దిగారు.

వారు తమలోతాము హాస్యసంభాషణలు చేసుకుంటూ నడుస్తూండగా, ఒక తెల్లని గడ్డం గల వృద్ధుడు ఇషాక్‌ను సమీపించి, ఆయన చెయ్యి తీసుకుని కళ్ళ కద్దుకున్నాడు. ఇషాక్ ఆ మనిషిని వెంటనే గుర్తించాడు; ఆ వృద్ధుడు దివాణానికి అడబానిస

సి. మాధవరావు

లనూ, మగబానిసలనూ సరఫరా చేసేవాడు, ఇషాక్ వద్ద ఆయన పంపిన బానిసలు చాలా మంది సంగీతం నేర్చుకున్నారు.

వృద్ధుడు ఖలీఫాను గుర్తించలేదు. అయినా ఆయన మిగిలిన వారికి క్షమాపణ చెప్పుకుని, ఇషాక్‌తో, "అయ్యా, తమను దర్శించాలని చాలా కాలంగా చూస్తున్నాను. దివాణానికే వద్దామనుకుంటూండగా, తమరే కనిపించారు. తమతో ఒక్క విషయం చెప్పాలి. నా బానిసల గృహంలో ఒక పిల్ల ఉన్నది. వాద్య సంగీతంలో ఇదివరకే మంచి ప్రవీణురాలు. తమ వద్ద కొద్దిరోజులు శిష్యత్వం చేసిందంటే అందరినీ మించగల దని నా నమ్మకం. ఈ ప్రావీణ్యానికి తోడు గొప్ప సౌందర్యవతి. తమరు ఒక్క పర్యాయం వచ్చి ఆమె పాట వినాలని నా ప్రార్థన. ఆమె పాట నచ్చినట్టయితే వెంటనే తమ భవనానికి పంపుతాను. నచ్చని పక్షంలో మరే వర్తకుడికైనా అమ్మేస్తాను," అన్నాడు.

ఇషాక్ ఒక్క క్షణం పాటు ఖలీఫాతో కన్ను గలిపి వృద్ధుడితో, "బాబుగారూ, మీరు ముందు వెళ్ళి ఆ పిల్లను సిద్ధంచెయ్యండి. మేం వెనకనే వస్తున్నాం," అన్నాడు.

వృద్ధుడు వెళ్ళిపోయాడు. ఖలీఫా, ఆయన అనుచరులూ తాపీగా ఆయన వెన



కగా బయలుదేరారు. వారి కిది చెప్పుకో దగిన విచిత్రానుభవం కాకపోయినా, బెస్త వాడు వలలో పడ్డ మొదటి చేపను స్వీక రించినట్టుగా వారు దీన్ని స్వీకరించారు. వారు బానిసల గృహం చేరుకుని బానిసల విక్రయం జరిగే చావడిలోకి అడుగు పెట్టారు. వారక్కడి ఆసనాలలో కూర్చుని ఉండగా వృద్ధుడు ఒక పిల్లను తెచ్చి ఒక విశాలమైన బల్ల మీద కూర్చోబెట్టాడు. ఆమె తాను తెచ్చుకున్న కిన్నెర వాయిస్తూ ఒక పాట దివ్యంగా పాడింది.

ఆ పాటకు ఖలీఫా పారవశ్యం చెంది, మైమరచి, "ఆహా, ఏమి కంఠం, ఏమి పాట!" అనేసి, తన మారువేషం జ్ఞప్తికి తెచ్చుకుని పలక కుండా ఊరుకున్నాడు. ఇషాక్ కూడా ఆమెను ప్రశంసించటానికి ఏదో అనబోయాడు. అంతలోనే ఆమె ఇషాక్ వద్దకు పరిగెత్తుకు వచ్చి, అతని చేతులెత్తి తన నుదుటికి తాకించుకుని, "గురూ, మీ ఎదట చేతులాడవు, గొంతు పెగలదు. నా జన్మ తరింపజేసే శక్తి మీకు తప్ప మరొకరికి లేదు," అని కన్నీరు కార్చ సాగింది. ఆమె దుఃఖం చూసి ఇషాక్‌కు ఆశ్చ ర్యమూ, జాలీ కూడా కలిగాయి. అత నామెతో, "ఎందుకమ్మా దుఃఖిస్తావు? నీ వెవరు?" అని అడిగాడు. ఆమె మిగి





లిన వారి కేసి చూసి జవాబు చెప్పకపోయే సరికి, ఇషాక్ ఖలీఫా అనుమతి ఒక్క చూపుతో సంపాదించి, ఆమెను దూరంగా తీసుకుపోయాడు.

అక్కడ ఆమె తన మేలిముసుగు తొలగించి ఇషాక్‌కు తన ముఖం కనబడనిచ్చింది. ఆమె అందం చూసి ఇషాక్ నివ్వెరపోయి, మృదువుగా, "చెప్పమ్మా, నీకేం కావాలి?" అని అడిగాడు.

"నాది సుఖంలేని జన్మ. మీకు శిష్యురాలిని కావాలని ఎన్ని నెలలుగానో తపస్సు చేస్తున్నాను. బానిసల అమ్మకం జరిగినప్పుడల్లా ఏదో వంక చెప్పి అమ్ముడు పోకుండా తప్పించుకుంటూ వచ్చాను. దేశదేశాలకూ పాకిన మీ కీర్తి విని మీ వద్ద సంగీతం నేర్చుకోవాలని ఎదురు చూస్తున్నాను," అన్నదామె.

ఇంతలో వృద్ధు డక్కడికి వచ్చాడు. ఇషాక్ ఆయనతో, "ఈ పిల్ల వెల ఎంత? ఈమె పేరేమిటి?" అని అన్నాడు.

"ఆమె పేరు తుఫ్‌హా అల్‌కులూబ్. ఆమె వెల అంటారా, అది కనీసం పదివేల దీనారాలు. ఆ ధరకు వర్తకులతో నేను బేరాలు చేశాను. బేరం కుదరకపోవటానికి కారణం ధర కాదు, ఆ పిల్లే పడనిచ్చింది కాదు. బేరం కుదరబోయేటట్టున్నప్పుడల్లా కొనే వారిని ఏదో ఒక మాట అని బేరం సాగకుండా చేస్తూ వచ్చింది. నేను తమర్ని పదివేల దీనారాల కంటె అడగలేను. కాని న్యాయంగా అది నా ఖర్చులకే సరిగా చాలదు," అన్నాడు వృద్ధుడు.

ఇషాక్ నవ్వి, "సరే, నీ వడిగిన దానికి మూడింతలు చేసుకో. అదే ఆమెకు సరయిన ధర అనుకుందాం. ఇవాళే ఆమెను మా యింటికి పంపి డబ్బు పట్టుకు వెళ్ళు," అన్నాడు. తరవాత ఇషాక్ అక్కడి నుంచి బయలుదేరి ఖలీఫా వద్దకు వచ్చి ఆయనతో జరిగిందంతా చెప్పాడు.

అనుకున్న ప్రకారం వృద్ధుడా పిల్లను ఇషాక్ భవనానికి చేర్చి, ముప్పై వేల దీనారాలు తీసుకుని వెళ్ళిపోయాడు. ఇషాక్ దాసీలు తుఫ్‌హా చుట్టూ మూగి, ఆమె చేత స్నానం చేయించారు, జుట్టు అలంకరించారు, మంచి ఖరీదైన ఆభరణాలు తొడిగారు, మంచి దుస్తులూ, జరీ మేలిముసుగులూ కట్టబెట్టారు. వారు చేయవలసిందంతా చేసినాక ఆమె ముఖం రాజోద్యానంలోకి తొంగిచూసే చంద్రబింబంలాగా తయారయింది. ఇషాక్ ఇంటికి తిరిగివచ్చి, కొత్త పెళ్ళి కూతురులాగా ముస్తాబైన ఆ పిల్లను చూసి, "ఈమే గనక నా దగ్గిర జంత్రగాత్ర సాధన కొద్దిగా అభ్యసించినట్టయితే నిశ్చయంగా ఖలీఫా అంతఃపురానికి జ్యోతి అవుతుంది. ఈమె పూర్తిగా మానవ స్త్రీ అని నాకు తోచటం లేదు," అనుకున్నాడు.

అతను ఆమె విద్యాభ్యాసానికిగాని, వినోదాలకుగాని ఎలాటి ప్రతి బంధకమూ లేకుండా, రాజోపచారంగా జరిగిపోయే ఏర్పాట్లన్నీ చేయించాడు. కొన్నివారాలపాటు ఆమెకు కళాసౌందర్యాలతో బాటు సమస్త సౌఖ్యాలు కూడా లభించాయి.

ఒకనాడు, తనతోటి విద్యార్థినులందరూ వనవిహారం చేయబోయారు; భవనంలో



ఎవరూ లేరు. అలాటి సమయంలో తుఫ్‌హా సంగీత సాధన జరిగే చోటికి వెళ్ళి, తన మామూలు చోట కూర్చుని, కిన్నెర తీసుకుని తన కోసం తానే పాట ప్రారంభించింది. ఆమె వేళ్ళ నుంచీ, కంఠం నుంచీ గానామృతం వెల్లువలై ప్రవహించింది.

ఆమె అలా పాడుతూండగానే ఇషాక్ ఖలీఫాతో కొంతసేపు కాలక్షేపం చేసి ఇంటికి తిరిగి వచ్చాడు. అతను ఆమె పాట విని అది మానవులకు సాధ్యమయే గానమని నమ్మలేకపోయాడు. అప్రయత్నంగా అతని నోటి వెంట ఆశ్చర్యపూరితమైన కేక వెలువడింది. అతని కంఠం వినగానే తుఫ్‌హా

అతని వద్దకు వెళ్ళింది. అతను నీరసించిన ముఖంతో, గోడకు చేరగిలబడి గుండెల మీద చేతులుంచు కోవటంచూసి, "మీకు వంట్లో సరిగా ఉంది గద!" అన్నది.

"ఇప్పుడు హాలులో పాడింది నీవేనా?" అని ఇషాక్ ఆమె నడిగాడు.

"అవును, ఆ అభాగ్యురాలిని నేనే!" అన్నదామె.

ఇషాక్ తల వంచుకుని గొణుగుతూ "పరిస్థితి ఎలా వచ్చింది! ఇషాక్, నీకన్న గొప్ప గాయకుడు లేడనుకున్నావు. నీకేమీ రాదనీ, నీకు తెలిసిన దంతా తప్పులతడక అనీ తేలిపోయింది!" అనుకున్నాడు.

అతను ఆమె చేతులు తీసుకుని కళ్ళకద్దుకో బోయాడు. తుఫహా చప్పున చేతులు లాగేసుకుని, "ఇదేమిటి, గురూ? నేను మీ బానిసను!" అన్నది.

"అలా అనకమ్మా! ఇషాక్ గురుత్వం చెల్లిపోయింది. నీ గానం ముందు నాది, దీనారు పక్క దిరహం వంటిది. నీకు వంక అన్నది లేదు. నిన్నివాళే ఖలీఫా దగ్గిరికి తీసుకుపోయి హాజరు పెడతాను. దేవుడది వరకే నిన్ను సృష్టికి రాణిని చేశాడు. ఖలీఫా నిన్ను స్త్రీజాతికి రాణిని చేస్తాడు. అప్పుడు ఈ ఇషాక్‌ను మాత్రం మరిచిపోకు," అన్నాడు ఇషాక్.



అతను చప్పట్లు చరచగానే దాసీలు పరిగెత్తుకుంటూ వచ్చారు. తుఫ్‌హాను చక్కగా అలంకరించమని అతను వారి నాజ్ఞాపించాడు. వా రామెను ఒక దేవతా స్త్రీ లాగా ముస్తాబు చేశారు. తరవాత వారు కూడా ఆమె ననుసరించి ఖలీఫా వద్దకు బయలుదేరారు. ఒక నీగ్రో కుర్రవాడి చేత కిన్నెర మోయిస్తూ ఇషాక్ వారి కన్న ముందుగా బయలుదేరాడు. అతను తుఫ్‌హాను బయటి చావడిలో ఉంచి, తాను ఖలీఫా ఉండే చోటికి వెళ్ళి, "మహాప్రభూ, దేవలోకం నుంచి జారిపడిన గాయనీమణి తుఫ్‌హాను తమ వద్దకు తీసుకొచ్చాను. ఆమె ఇప్పుడు నా శిష్యురాలు కాదు, నాకు గురువు!" అన్నాడు.

"ఈ దేవలోకసుందరి ఆ నాడు మనం బానిసల ఇంట చూసినదేనా?" అని అడిగాడు ఖలీఫా.

"చిత్తం," అన్నాడు ఇషాక్. ఆమెను లోపలికి తీసుకురావచ్చునని ఖలీఫా ఇషాక్‌తో అని, అతను అవతలికి వెళ్ళగానే జాఫర్‌తో, "ఈ ఇషాక్ ఇవాళ మరెవరినో మెచ్చుకుంటున్నాడే! ఏమిటీ విపరీతం?" అన్నాడు నవ్వుతూ.

ఇషాక్ త్వరలోనే తన శిష్యురాలిని చెయ్యిపట్టి నడిపిస్తూ లోపలికి తీసుకు



వచ్చాడు. ఆమె ఖలీఫాకు అభివాదం చేసి, ప్రణామాలర్పించి, తన మేలిముసుగు తొలగించింది. ఆమె అందం చూసి ఖలీఫా మూర్ఛపోయినంత పని చేశాడు. జాఫర్ మస్రూర్‌లు కూడా తమ కళ్ళను తామే నమ్మలేక పోయారు. ఖలీఫా లేచివచ్చి ఆమెను సమీపించి, ఆమె ఆ క్షణం నుంచీ తన సొత్తని తెలియజేయటానికి ఆమె ముఖాన మేలిముసుగు కప్పాడు. తరవాత ఆయన ఆమెను కూచోమని, "ఓ, తుఫ్‌హా, నీ రాకతో మా భవనానికి కళ వచ్చింది. నీతో వచ్చిన సంగీతాన్ని కూడా మా చెవుల వెయ్యి," అన్నాడు,

నీగ్రోకుర్రవాడి నుంచి కిన్నెర అందుకుని, ఖలీఫా సింహాసనం చెంత నేలపై కూర్చుని తుఫ్‌హా, కొంచెంసేపు దానిపైన ఆలాపన చేసి, తరవాత వాయిస్తూ ఒక పాట పాడింది. ఖలీఫా ఆనందం పట్టలేక సింహాసనం దిగి ఆమె పక్కన చతికిలబడి, "తుఫ్‌హా, నీవు నిజంగా వర ప్రసాదానివి. ఇషాక్, నీ ఏమెను గురించి చెప్పదగినంతగా చెప్పలేదు. నిజంగా నీ ఏమెకు ఏమీ చాలవు," అన్నాడు.

"అందులో ఏమీ అబద్ధం లేదు. ఆమె ఒంటరిగా పాడుకుంటూండగా విన్నప్పుడే నాకా సంగతి తెలిసిపోయింది," అన్నాడు ఇషాక్ వినయంగా.

తుఫ్‌హా ఇంకొక పాట పాడింది. ఖలీఫా కళ్ళ వెంట ఆనంద బాష్పాలు రాలాయి. వాటిని దాచటానికి కూడా ఆయన యత్నించ లేదు. ఆయన మస్రూర్‌తో, "మీ యజమానురాలిని అంతఃపురంలోని అగ్ర మందిరంలో ప్రవేశపెట్టి, ఆమె కేలోటూ లేకుండా అన్ని ఏర్పాట్లూ చూడు," అన్నాడు.

ఆయన ఇషాక్‌కు లక్ష దీనారాల బహుమానం ఇచ్చి పది దుశ్శాలువలు బహూకరించి ఘనంగా సన్మానించాడు.

—[ వచ్చే సంచికలో ముగింపు ]






# హత్యానేరం

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, మామూలు మనుషులు అర్థం చేసుకోలేని మంత్రశక్తులలో చిక్కుకుని మథనపడుతూ ఉన్నావు. నిన్ను చూస్తే నాకు సహమిత్రుడనేవాడి వృత్తాంతం జ్ఞాపకం వస్తున్నది. మంత్రశక్తులకు చిక్కిన వాడి గతి ఏమయేదీ నీకు తెలియగలందులకు ఆ సహమిత్రుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

సహమిత్రుడు సింధూతీరవాసి. అతను యువకుడై ఉండగా వింధ్యారణ్య ప్రాంతానికి రావటం జరిగింది. అక్కడ కరికుబ్జమనే చోటికి సమీపాన ఉన్న వన ప్రాంతానికి అతను ఒకనాడు విహారార్థం వెళ్ళాడు. ఆ చుట్టు పక్కల పులుల భయం జాస్తి

బేతాళ కథలు



అనీ, కొన్ని ప్రదేశాలు శాపగ్రస్తమైనవనీ అతను విని ఉన్నాడు. ఆ ప్రాంతాల నివసించే వారెవరూ గ్రామాలు విడిచి షికార్లకు వెళ్ళరు. ఒక గ్రామం నుంచి మరొక గ్రామానికి వెళ్ళినప్పటికీ కాలిబాటలు దాటి వన ప్రాంతాలకు పోరు.

సహమిత్రుడు తాను విన్న మాట లేవీ నమ్మలేదు. అతను ధైర్యంగా వనప్రాంతం ప్రవేశించాడు. అది శరత్కాలం కావటం చేత చెట్లన్నీ చక్కని గుబుళ్ళతో అందంగా ఉన్నాయి. నేల మీద పచ్చిక తివాసీ పరిచినట్టున్నది. పొదలన్నీ పుష్పించి మంచి మంచి వాసనలు వెదజల్లుతున్నాయి.

ఆ ప్రదేశం అతనికి ఎంతో మనోహరంగా కనబడింది. అతను కొన్ని చెట్ల మధ్య ఉన్న పచ్చిక పైన నడుము వాల్చి, ఆకాశాన దూది పింజెలలాగా తేలిపోయే మబ్బులను చూసి ఆనందిస్తూ, చల్లగాలికి నిద్రపోయాడు.

అతను ఎవరో కొట్టినట్టుగా నిద్ర లేచి, కాలం అపరాహ్నం దాటిందనీ, తన కడుపులో ఆకలి దహించుకుపోతున్నదనీ తెలుసుకున్నాడు. అతను అప్రయత్నంగా పొట్ట నిమురుకునే సరికి చేతికి బిరుసుగా బొచ్చు తగిలినట్టయింది. చేతులెత్తి చూసుకుంటే చేతులకు బదులు పులి పంజాలు కానవచ్చాయి. చేతి మీద పసుపురంగు రోమాలూ, వాటి మీద అందమైన నల్లని చారలూ ఉన్నాయి. తాను పులిగా మారిపోయినట్టు సహమిత్రుడు తెలుసుకున్నాడు. దూరాన ఉన్న నీటి మడుగు దగ్గిరికి వెళ్ళి అందులోకి తొంగిచూచాక తన మార్పు నిజమేననీ, అందులో భ్రమ ఏమీ లేదనీ అతనికి రూఢిగా తెలిసిపోయింది.

ఈ మార్పు గురించి మొట్టమొదట సహమిత్రుడికి అంతగా విచారమేమీ కలగలేదు. పైపెచ్చు ఇదొక విచిత్రమైన అనుభవం అనిపించింది. ఒళ్ళు విరుచుకుంటే తన

అవయవాలలో అంతులేని బలం ఉన్నట్టు తోచింది. అతను ఉత్సాహంగా అటూ ఇటూ పరిగెత్తాడు, లాఘవంగా ఎగిరి రాళ్ళ గుట్టల మీదికి ఎక్కాడు, అంతకంటె లాఘవంగా వాటి మీది నుంచి కిందికి దూకాడు.

అంతా బాగానే ఉన్నది గాని సహమిత్రుడికి ఆకలి క్షణక్షణానికీ ఎక్కువవుతున్నది. ఏ జంతువునన్నా చంపి తిందామన్నా కనుచూపు మేరలో వేటాడ దగిన జంతువేమీ కనిపించలేదు. కరికుబ్జగ్రామం సమీపంలో ఏదైనా ఆహారం దొరకవచ్చు ననుకుని, అతను గ్రామాన్ని చేరబోయి, ఊరి వెలపల ఒక కంచె మాటున పొంచి కూర్చున్నాడు.

కొంతసేపటికి కాలిబాట వెంబడి ఒక స్త్రీ పోవటం అతని కళ్ళ బడింది. వింధ్య ప్రాంతపు స్త్రీలు చాలా అందగత్తె లని విన్నాడు గాని అతను అంతదాకా ఏ స్త్రీనీ దగ్గిరగా చూడలేదు. ఈ మనిషిని సమీపంగా చూద్దామని అతను కంచె ఇవతలి నుంచి కాలిబాట కేసి రాసాగాడు. అంతలోనే ఆ స్త్రీ అతన్ని చూసి, "అమ్మో, పెద్ద పులి!" అని అరుస్తూ గ్రామంలోకి పారిపోయింది. ఈ రూపంలో ఉండగా మానవులెవరూ తనకు కనుచూపు మేరలోకి రారని అతనికి మొట్టమొదటిసారిగా తెలిసివచ్చింది.



అందుకని విచారించటానికి కూడా అతనికి అవకాశం లేకుండా ఆకలిమంట రెచ్చిపోతున్నది. చీకటిపడిన దాకా ఆగి, తినటాని కేమీ దొరకక, అతను గ్రామం ప్రవేశించాడు. గ్రామంలో ఇళ్ళన్నీ భద్రంగా మూసి ఉన్నాయి. ఎక్కడా ఒక్క దూడ కూడా కనిపించలేదు. గ్రామం దగ్గిర పులి ఉన్నదని గ్రామస్తులు జాగ్రత్తపడ్డారు.

చేసేదిలేక, ఆకలితో బాధపడుతూ, సహమిత్రుడు వనప్రాంతానికి తిరిగివచ్చి ఒక చోట పడుకుని నిద్రపోయాడు. అతనికి తిరిగి మెలకువ వచ్చేసరికి తెల్లవార వస్తున్నది దూరాన ఉండే బాట వెంట జనం



నడిచే అలికిడి అతనికి వినిపించింది. మనిషిని చంపి తినటమంటే అతనికి దారుణంగానే తోచింది, కాని ఏదో ఒక ఆహారం పడకపోతే తన చావు తప్పేటట్టు లేదు.

అతను నిశ్శబ్దంగా నడుస్తూ కాలిబాటకు సమీపంగా వచ్చి, ఒక పెద్ద పొదచాటున కూర్చున్నాడు. కొద్దిసేపటికి మనుషులు వస్తున్న సవ్వడి వినిపించింది. ముగ్గురు మనుషులు కరికుబ్జం కేసి పోతున్నారు. వారిలో ఒకడు లావుగా మిసమిసలాడుతూ ఉన్నాడు. అతను ఎవరో ఉద్యోగిలాగున్నాడు. మిగిలిన ఇద్దరూ అతనితో అతి వినయంగా మాట్లాడుతున్నారు. సరి అయిన క్షణం కనిపెట్టి, సహమిత్రుడు సూటిగా ఆ లావుపాటి వాడి పైకి దూకి, అతన్ని నోట కరుచుకుని కొండల కేసి ఈడ్చుకు పొయ్యాడు. మిగిలిన ఇద్దరూ కాలి సత్తువ కొద్దీ పారిపోయారు.

ఎలాగైతేనేం సహమిత్రుడికి ఆకలి బాధ తీరింది. కాని తన అవతారం మీద అసహ్యం కలిగింది. మనిషిని చంపి తిన్నందుకు అతను పశ్చాత్తాపపడలేదు గాని, అలా జీవించటం రోత అనిపించింది. తాను పెద్ద పులి రూపం పొంది ఇంకా పూర్తిగా ఒక రోజు కాలేదు. ఈ కాస్త కాలంలోనే అతనికి పెద్దపులి జీవితంలో ఆనందం లేదని తోచింది. తిరిగి మనిషి కావటం ఎట్లాగన్న సమస్య అతన్ని వేధించ సాగింది. చప్పున అతనికొక ఆలోచన తట్టింది ; తాను మొదట ఎక్కడ పడుకుని పెద్దపులి రూపం పొందాడో తిరిగి అక్కడే పడుకుంటే? ప్రయత్నం చేసి చూడటంలో నష్టం లేదు గనక, సహమిత్రుడు ఆ చోటు వెతుక్కుంటూ వెళ్ళి అక్కడే పడుకుని చిన్న కునుకు తీశాడు.

అతని ఊహ సరిగానే ఉన్నది. మరి కొంచెం సేపటికి అతను నిద్రలేచి చూసుకుంటే, ఎప్పటిలాగా మనిషి అయి ఉన్నాడు. అత నొక పెద్ద నిట్టూర్పు

విడిచి గ్రామానికి తిరిగి వెళ్ళి తన బస చేరుకున్నాడు.

బస ఇచ్చిన పెద్ద మనిషి, "వచ్చారా, బాబూ! నిన్న ఈ వేళ ననంగా వెళ్ళారు. తిరిగి రాకపొయ్యేసరికి పులివాత పడ్డారేమో నని భయపడి పోయాం. నిన్న సాయంకాలం వేళ గ్రామంలోకి పెద్దపులి వచ్చింది, తమకు తెలుసునో లేదో. ఇవాళ తెల్లవారు జామున ఈ గ్రామానికి వచ్చే ఒక అధికారిని అది పొట్టన పెట్టుకున్నది," అన్నాడు.

"ఆ పులి నన్నేమీ చెయ్యదులే!" అన్నాడు సహమిత్రుడు నిర్లక్ష్యంగా.

అతను తాను వచ్చిన పని ముగించుకుని తన దేశానికి తిరిగి వెళ్ళిపోయాడు. చాలా ఏళ్ళు గడిచాయి. అతను కాశీరాజు కొలువులో చేరి, మంచి పదవికి వచ్చాడు. ఈ మధ్య కాలంలో అతను తన పెద్దపులి జీవితం గురించి ఎవరితోనూ చెప్పలేదు.

ఒకనాడు అతను గంగాతీరాన రాజోద్యోగులైన కొందరు మిత్రులతో కూర్చుని మాట్లాడుతూ, మాటల సందర్భాన తన చిన్ననాటి అనుభవాన్ని చెప్పి, మానవుల కన్న జంతువులు ఎక్కువ సుఖంగా జీవించలేవని నిరూపించబోయాడు. కాని, అతను తాను పులిగా ఉండి ఫలాని చోట మనిషిని



చంపి తిన్నానని చెబుతూండగానే, అక్కడ కూర్చున్న వారిలో ఒక యువకుడు చరున కత్తి దూసి, కళ్ళు నిప్పులు కక్కుతూ, "నీచుడా, నీవేనా నా తండ్రిని పొట్ట బెట్టుకున్నది? నిన్నిప్పుడే హతమార్చి నా తండ్రి మరణానికి పగ తీర్చుకుంటాను," అని మీదికి వచ్చాడు.

సహమిత్రుడీ పరిణామం చూసి నిర్ఘాంత పోయాడు. "నన్ను క్షమించాలి. నేనా సమయంలో మనిషినైనా కాను. అదీ గాక ఆకలితో మాడిపోతున్నాను. అయినా ఆ పెద్ద మనిషి మీ తండ్రి అని నాకేం తెలుసు?" అన్నా డతను.

ఈ క్షమాపణ ఆ యువకుడికి ఏ మాత్రమూ నచ్చలేదు. మిగిలిన వాళ్ళు ఆ క్షణాన అడ్డుపడి సహమిత్రుడి ప్రాణాలు కాపాడారే గాని, ఆ కుర్రవాడి ఆగ్రహం అనుచితమని అనలేక పోయారు. "నిన్ను ఎక్కడో అక్కడ, ఎప్పుడో అప్పుడు చంపి నా పగ తీర్చుకు తీరుతాను," అని ఆ యువకుడు శపథం చేశాడు. మిత్రుల సలహాపై సహమిత్రుడు ఆ రాత్రే కాశీ రాజ్యం వదిలి పెట్టి స్వదేశానికి వెళ్ళిపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. సహమిత్రుడు నరహత్యా చేసిన దోషి అవునా, కాడా ? అతన్ని చంపి తండ్రి చావుకు పగ తీర్చుకునే హక్కు ఆ యువకుడికి ఉన్నదా, లేదా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పెద్ద పులి మనిషిని చంపటం స్వాభావికం. మనిషి మనిషిని చంపటం అస్వాభావికం; దానికి వ్యక్తిగతమైన కారణం ఉంటుంది. పులి ఏ మనిషినైనా చంపి తింటుంది. అది నరజాతి కంతకూ శత్రువు. అందుకే దాన్ని ఏ మనుషులైనా వేటాడి చంపవచ్చు. పులికి విచారణా, శిక్షా అంటూ వేరు వేరుగా ఉండవు. మనిషిని చంపే మనిషికి విచారణా, శిక్షా వేరు వేరుగా ఉంటాయి. ఏ కారణం చేతనైనా నరహంతకుడు వాటి రెంటినీ తప్పించుకుంటే, చనిపోయిన వాడి పక్షానికి చెందినవారు మాత్రమే పగ సాధిస్తారు. సహమిత్రుడు అలాటి నరహంతకుడు కాడు. అందుచేత అతను నిర్దోషి. తన తండ్రి చావుకు పగ తీర్చుకుంటానని యువకుడనటంలో అర్థం లేదు," అన్నాడు.

ఈ విధంగా రాజుకు మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# వల్కలచీరి కథ

పోతనం అనే నగరాన్ని సోమచంద్రు డనే రాజు పాలించేవాడు. ఆయన భార్య పేరు ధారిణి. వారికి ప్రసన్నచంద్రు డనే కొడు కుండేవాడు. ఒకనాడు ధారిణి తన భర్తకు తల దువ్వుతూ తలలో ఒక నెరిసిన వెంట్రుక చూసి హాస్య మాడింది.

"నే నిక రాజ్యం చేస్తూ కూర్చోవటానికి లేదు. ఇప్పటికే మించిపోయింది. నేను అరణ్యానికి వెళ్ళి ఋషిలాగా జీవిస్తూ తపస్సు చేసుకుంటాను," అన్నాడాయన.

భర్తను విడిచి ఉండలేని ధారిణి, "మీరు అరణ్యానికి వెళ్ళేటట్టయితే నేను కూడా వస్తాను," అన్నది.

సోమచంద్రుడు తన కొడుకైన ప్రసన్న చంద్రుడికి రాజ్యాభిషేకం చేసి, తన భార్యతో సహా అరణ్యానికి వెళ్ళి, తపస్సు సాగించాడు. ధారిణి కొంత కాలానికి గర్భవతిగా ఉండి, కాలక్రమాన ఒక మగపిల్ల వాణ్ణి కన్నది. వాడికి వల్కలచీరి అని పేరు పెట్టారు.

కొద్దికాలానికి ధారిణి చనిపోగా సోమ చంద్రుడు వల్కలచీరిని తానే గేదె పాలు పోసి పెంచాడు. బుద్ధి తెలిసి నప్పటి నుంచీ వల్కలచీరి మునులను మాత్రమే ఎరుగును.

ఋషి జీవితం గడిపే తన తండ్రి వద్ద అరణ్యంలో తన తమ్ము డొకడు పెరుగుతున్న సంగతి ప్రసన్నచంద్రుడికి తెలియ వచ్చింది. అతను తమ్ముణ్ణి, ఎలాగైనా తన వద్దకు తెప్పించు కుందామని నిశ్చయించుకున్నాడు.

ఇందుకుగాను ప్రసన్నచంద్రుడు కొందరు వేశ్యలను పిలిపించి, వారికి ఆశ్రమవాసుల దుస్తులు ధరింపజేసి, పళ్ళూ, మిఠాయీ ఇచ్చి, ఎలాగైనా వల్కలచీరిని ఆకర్షించి వెంటపెట్టుకు రమ్మని అరణ్యానికి



పంపాడు. వేశ్యలు ఆశ్రమంలో ఒంటరిగా ఉన్న సమయంలో వల్కలచీరిని కలుసు కున్నారు. అతనికి తాము తెచ్చిన పళ్ళూ, మిఠాయీ పెట్టారు. వారు కూడా ఋషులే నని, వల్కలచీరి అనుకున్నాడు.

వేశ్యలు అతనితో, "మా ఆశ్రమం పోతనం అనే చోట ఉన్నది. మా ఆశ్ర మంలో చాలా సుఖంగా ఉంటుంది. మా వెంట వచ్చావంటే రోజూ ఇలాటి ఆహారం తినవచ్చు," అని చెప్పారు. వల్కలచీరికి పోతనాశ్రమం చూసి తీరా లన్న కోరిక గాఢంగా కలిగింది. కాని ఇంత లోనే సోమచంద్రుడు అటు వచ్చే జాడ కని పెట్టి వేశ్యలు అరణ్యంలోకి పారిపోయారు. వల్కలచీరి వారిని వెతకటానికి అరణ్య మార్గాన కొంత దూరం పోగా ఒక బండి వస్తూ కనిపించింది. అతను బండివాడితో, "మునీశ్వరా, పోత నాశ్రమానికి దారి ఎటు?" అన్నాడు. బండి లోనే ఉన్న బండివాడి భార్య నవ్వింది.

"పోతనానికి వెళ్ళాలంటే బండిలో ఎక్కి కూచో. నేను అక్కడికే పోతున్నాను," అన్నాడు బండివాడు. వల్కలచీరి బండిలో ఎక్కి కూచుని, దారి పొడుగునా, "ఆ ఋషి ఎవరు? ఆ కుటీరం ఏ ముని ఉండేది? ఆ ఆశ్రమం పేరేమిటి?" అని బండివాణ్ణి అమాయికంగా అడుగుతూ, తన అజ్ఞానంతో బండివాణ్ణీ, వాడి భార్యనూ కడుపుబ్బ నవ్వించాడు.

దారిలో ఒక దొంగ బండిని అటకాయిం చాడు. అయితే బండివాడు సామాన్యుడు కాడు; వాడు కర్ర తీసుకుని నెత్తిన ఒక్కటి పెట్టేసరికి దొంగవాడు కాస్తా విరుచుకు పడి పోయాడు. బండివాడు దొంగ వద్ద దొరికిన సొత్తంతా తీసుకుని, మళ్ళీ బండి ఎక్కి తిన్నగా పోతన నగరానికి పోనిచ్చాడు.

బండి పోతనం చేరగానే బండివాడు వల్కలచీరితో, "అబ్బాయీ, ఇదే పోతనా

శ్రమం. ఈ ఆశ్రమంలో ఏం కావాలన్నా ఇది ఉండాలి. అందుచేత వీటిని దగ్గిర ఉంచుకో,'' అంటూ కుర్రవాడికి కొన్ని డబ్బు లిచ్చి, తన దారిన తాను బండి తోలుకుని వెళ్ళిపోయాడు.

వల్కలచీరి ఆ నగరాన్ని చూసి అత్యాశ్చర్యం పొందాడు. అలాటి ఆశ్రమాలుంటాయని అతను కలలో కూడా అనుకోలేదు. దారిలో కనిపించిన వారందరినీ, ''మహా మునీ, నమస్కారం!'' అని పలకరిస్తూ వీధులన్నీ చుట్టబెట్టి చివరకు ఒక ప్రాంగణం ప్రవేశించాడు. అది రాజనర్తకి ఉండే ఇల్లు. వల్కలచీరి ఆమెను చూసి, ''నాయనగారూ, నా కొక కుటీరం ఇప్పించండి,'' అంటూ బండివా డిచ్చిన డబ్బులన్నీ ఆమె చేతిలో పోశాడు.

ఆమె, ''అలాగే, నాయనా!'' అని చెప్పి, వల్కలచీరికి చక్కగా తలంటి స్నానం చేయించి, కొత్తబట్టలు కట్టబెట్టి, అతనికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేసే తంతు యావత్తూ జరిపించింది. వల్కలచీరి దేనికీ అభ్యంతరం చెప్పక, అన్నీ చేయించుకున్నాడు. అయితే అతనికి పెళ్ళి పాటలు విని ఆశ్చర్యమూ, మేళవాద్యాలు చూసి భయమూ కలిగాయి.




ఈలోపుగా వేశ్యలు ప్రసన్నచంద్రుడి వద్దకు తిరిగివచ్చి జరిగినదంతా చెప్పారు. వారి వెంట తన తమ్ముడు రానందుకు అతను చాలా చిరాకుపడ్డాడు. అతను అసలే చిరాకులో ఉంటే, రాజనర్తకి ఇంట జరిగే మంగళవాద్యాల మోత మరింత చిరాకు కలిగించింది. ఆ ఆర్భాటమంతా ఏమిటని విచారించగా నిజం కాస్తా బయటపడింది. రాజనర్తకికి కానున్న అల్లుడు రాజుగారి తమ్ముడైన వల్కలచీరే!

ప్రసన్నచంద్రుడు తన తమ్ముణ్ణి తెచ్చి తన ఇంట ఉంచుకున్నాడు. అతను వల్కలచీరికి రాజ్యభాగ మిచ్చి, మంచి

రాజకుమార్తెలను ఏరి అతనికి పెళ్ళి కూడా చేశాడు.

వల్కలచీరి తన అన్నను చేరుకున్న కొద్దిరోజులకే రాజభటులు దొంగ అని బండి వాణ్ణి పట్టుకున్నారు. జరిగినదేమంటే, బండివాడు దొంగ నుంచి తీసుకున్న వస్తువులు కొన్ని అమ్మాడు. వాటిని పోగొట్టుకున్నవారు వాటిని చూసి, తమవని గుర్తించి ఆచోకీ తీయగా ఫలానా బండివాడు అమ్మినట్టు బయటపడింది. వారు ఫిర్యాదు చేసిన మీదట రాజభటులు బండివాణ్ణి పట్టి తెచ్చి రాజుగారి ముందుంచారు. తన అన్న పక్కనే ఉన్న వల్కలచీరి బండివాణ్ణి గుర్తించి, వాస్తవంగా జరిగిన దేమిటో బయటపెట్టి, బండివాణ్ణి విడిపించాడు.

వల్కలచీరి పన్నెండేళ్ళపాటు సుఖంగా జీవితం గడిపిన మీదట అతనికి తన తండ్రి మాట గుర్తుకొచ్చింది. ఈలోపల ఆ ముసలివాడు తన కొడుకు కోసం ఏడ్చి ఏడ్చి కళ్ళు రెండూ పోగొట్టుకున్నాడు. మిగిలిన మునులు ఆయనను కనిపెట్టి ఉంటూ వల్కలచీరిని గురించి వాకబుచేసి, "మీరేమీ విచారపడకండి. మీ వల్కలచీరి వాడి అన్నను చేరుకుని అక్కడ సుఖంగా ఉన్నాడు," అని సోమచంద్రుడితో చెప్పారు.

తన తండ్రి మాట జ్ఞాపకం రాగానే వల్కలచీరి పశ్చాత్తాపంతో దహించుకుపోయి, తండ్రిని చూస్తానని బయలుదేరాడు. అతని వెంట ప్రసన్నచంద్రుడు కూడా బయలుదేరాడు. అరణ్యంలో ప్రవేశించి ఆశ్రమాన్ని చేరుకునే దారిలో వల్కలచీరి తన అన్నకు తాను ఎరిగిన స్థలాలన్నీ చూపాడు. ఈలోపల సోమచంద్రుడు తన కొడుకు వస్తున్నాడన్న వార్త వినగానే, ఆయన కళ్ళ వెంట ఆగకుండా అశ్రువులు రాలాయి. దానితో ఆయనకు పోయిన దృష్టి మళ్ళీ తిరిగివచ్చింది. ఆ వింత చూసి అక్కడి మునులంతా ఆశ్చర్యపోయారు.






# రాక్షసి మెట్లు

పడమటి సముద్రతీరాన అనేక వేల ఏళ్ళ క్రితం ఒక గ్రామంలో గ్రామపెద్ద కొక కొడుకు కలిగాడు. వాడికి లలితుడని పేరు పెట్టుకున్నారు. లలితుడు పసితనం నుంచి కూడా అసాధరణమైన తెలివితేటలు ప్రదర్శించి, తన ఈడు పిల్లలను చదువులో మించిపోయి గ్రామంలో ఉండే వారందరికీ ప్రీతిపాత్రుడయాడు. అలాటి లలితుడు ఏడేళ్ళు నిండుతాయనగా ఒకనాడు ఎవరికీ తెలియకుండా అదృశ్యమయాడు. ఒక ఏడాదిపాటు గ్రామప్రజలంతా వెతికినా లలితుడేమైనదీ కూడా తెలియలేదు. అందుచేత వాడు మరి కనిపించడని నిర్ధారణ చేసేసుకున్నారు.

ఆ గ్రామంలోనే అందరికీ స్నేహపాత్రుడైన కమ్మరి ఒక డుండేవాడు. అతని పేరు వైభారుడు. కొడవళ్ళూ, గొడ్డళ్ళూ, పారలూ, బండి ఇరుసులూ, నాగటికర్రులూ చెయ్యుటంలో అతని పనితనం గొప్పది. ఇంతేగాక వైభారుడు కలలకు అర్థాలు చెప్పటంలో ఘటికుడు. ఊళ్ళో ఎవరి కేవింత కల వచ్చినా దాని అర్థం చెప్పించుకోవటానికి ముందుగా కమ్మరి దగ్గిరికి వచ్చేవారు. ఊళ్ళో సంబరాలు జరిగినప్పుడు వైభారుడు లేకపోతే అవి రక్తి కట్టేవి కావు.

లలితుడు మాయమై ఏడేళ్ళు గడిచింది. ఒక రాత్రి కమ్మరికి ఆ కుర్రవాడు కలలో వచ్చాడు. వా డొక తెల్లగుర్రాన్ని ఎక్కి ఉన్నాడు. వాడు కమ్మరితో, "ఇంత కాలమూ నేను జృంభకాసురుడి నౌకరుగా ఉన్నాను. నా నౌకరీకి గడువు తీరిపోయింది. నీవు వచ్చి నన్ను తీసుకుపోవాలి. నేనుంటున్నది రాకసి కొండలో," అన్నాడు.

"ఇదంతా కలలాగుందే, నిజమని ఎట్లా నమ్మటం?" అని కమ్మరి తెలివిగా లలితుణ్ణి అడిగాడు కలలోనే.

వి. నాగరాజు



"ఇదే నీకు గుర్తు!" అన్నాడు లలితుడు. కుర్రవా డా మాట అంటూండగానే వా డెక్కిన తెల్లగుర్రం ముందు కాలెత్తి కమ్మరి నుదుటి మీద తన్నింది.

ఆ దెబ్బకు వైభారుడు నిద్రలేచి కూర్చుని ముఖం తడువుకున్నాడు. నుదురు ఇంకా తీపు పెడుతూనే ఉంది. అద్దంలో చూసుకుంటే నుదుటి మీద గుర్రంగిట్ట గుర్తు కనిపించింది.

అందరి కలలకూ అర్థాలు చెప్పాడు కాని కమ్మరికి తన కల అర్థం కాలేదు.

సముద్రానికి కొంచెం లోపలిగా ఒక కొండ ఉన్న మాట నిజమే. దాని కింది నుంచి పైకి రాళ్ళు మెట్లలాగా పేర్చి ఉన్నాయి. అయితే వాటిని మానవమాత్రు లెవరూ మెట్లలాగా ఉపయోగించ లేరు. కాలు ఎత్తి సులువుగా ఇళ్ళకప్పుల మీద పెట్ట గల రాక్షసులు నిజంగా ఉంటే వాళ్ళు ఆ మెట్లను ఎక్కి వెళ్ళవచ్చు. అందుచేతనే అందరూ వాటిని రాక్షసిమెట్లు అనే వారు. ఏనాడో ద్వాపరయుగంలో జృంభకాసురుడూ వాడి అనుచరులూ వాటిని మెట్లుగా ఉపయోగించి కొండ పైకి వెళ్ళేవారనీ, కొండ దిగువ మెట్టు నుంచి సముద్రతీరానికి ఒక్క అంగలో వచ్చే వారనీ చెప్పుకునేవారు. మామూలు మనుషులు నీటి మధ్య ఉన్న ఆ కొండను చేరుకోవాలంటే తెప్పల మీద వెళ్ళాలి.

కమ్మరి వైభారుడు తనకు వచ్చిన కలను పూర్తిగా నమ్మటానికీ, సాధ్యమైతే రాక్షసుల నౌకరీ నుంచి లలితుణ్ణి కాపాడటానికీ నిశ్చయించుకున్నాడు. కుర్రవాణ్ణి కాపాడటం సాధ్యం కాకపోయినా కనీసం కలలో నిజం ఏపాటి ఉన్నదీ తెలుసుకున్నట్టన్నా అవుతుంది!

అతను సాయంకాలం దాకా ఆగి ఇంటి నుంచి బయలుదేరాడు. బయలుదేరేటప్పుడు, ఎందుకైనా మంచిదని, ఒక



నాగటికర్రు చువ్వ వెంట తీసుకున్నాడు. అతను తిన్నగా తన స్నేహితుడైన పల్లె వాడి వద్దకు వెళ్ళి, వాడితో తన కల గురించీ, తాను తలపెట్టిన పని గురించీ చెప్పాడు. అంతా విని పల్లెవాడు, "సరే, కొండ చేరా లంటే నా తెప్ప ఉన్నది. నేనే స్వయంగా నిన్నక్కడికి చేర్చుతాను," అన్నాడు.

ఇద్దరూ పల్లెవా డింటనే భోజనం చేసి, తెప్ప మీద బయలుదేరారు. చీకటి రాత్రి. సముద్రం ప్రశాంతంగా ఉన్నది. ఆకాశం నిర్మలంగా ఉన్నది. కమ్మరికి తా నొక భయంకరమైన పని మీద పోతున్నట్టు కూడా అనిపించ లేదు. కొంత సేపటికి తెప్ప కొండను సమీపించి రాక్షసిమెట్లను చేరుకున్నది.

ఇంతవరకు కమ్మరికి ఏం చెయ్యాలో తెలిసింది గాని ఇంక చేసేదేమిటో తెలియ లేదు. రాక్షసులు నిజంగా ఉంటే కొండ లోపల ఉంటారు. కొండ లోపలకి పోవ టానికి ద్వార మంటూ ఏమీ లేదు. ఒక మాయద్వారం ఉంటుందనీ, అది సరిగా నడిరాత్రి తెరుచుకుంటుందనీ ఒక వాడుక ఉన్నది. అది నిజమో అబద్ధమో తెలియదు.

"ఏదో కలను నమ్మి ఇలా వచ్చాం గదా, మన కన్న మూర్ఖు లెవరైనా



ఉంటారా?" అన్నాడు కమ్మరి తన మిత్రుడితో.

"ఆ సంగతి నీకే తెలియాలి," అన్నాడు పల్లెవాడు.

సరిగా అదే సమయానికి కొండ దిగు వన, నీటిమట్టానికి సమంగా, కొండ మధ్య అస్పష్టంగా ఏదో కాంతి కనిపించింది. ఆ కాంతిలో కమ్మరికి ఒక విశాలమైన గుహ ముఖం పొడగట్టింది. అతను తన కర్రు చువ్వ భుజానపెట్టుకుని ధైర్యంగా ఆ గుహ కేసి వెళ్ళాడు. దగ్గిరికిపోయి చూస్తే గుహ స్పష్టంగానే తెలుస్తున్నది, కాని భయంకరం గానూ, భ్రమలు పుట్టించేదిగానూ ఉన్నది.





అందులో మనిషిముఖాల భాగాలు ఒకదాని కొకటి చేర్చినట్టుగా, ఒక దానిలో ఒకటి దూర్చినట్టుగా ఉన్నాయి.

ఈ ఆకారాల కేసి చూస్తూన్నకొద్దీ భయం ఎక్కువయేటట్టు కనిపించి, కమ్మరి గుహ లోపలికి ప్రవేశించాడు. గుహ ద్వారం వద్ద ఉన్న కాంతి లోపల లేదు. అక్కడ చీకటి. దానికి తోడు గుహ అనేక మెలికలు తిరి గింది. తడువుకుంటూ ఆ మెలికల వెంబడి కొద్ది దూరం వెళ్ళేసరికి కన్ను పొడుచు కున్నా కనపడని చీకటి.

"ఈ గుహలోకి ఇంక కొంచెం దూరం వెళ్ళానంటే తిరిగి బయటికి రావటం అసం భవం. అందుచేత వెనక్కు వెళ్ళటమే క్షేమం," అని అతను అనుకునే సమయా నికి వెనక నుంచి దభేలుమని పెద్ద చప్పుడు వినిపించింది. గుహ ద్వారం మళ్ళీ మూసు కుని ఉంటుందనీ, చచ్చినా బతికినా ముందుకు వెళ్ళటమే పౌరుషమనీ అను కుని అతను ముందుకు చూశాడు. దూరాన ఎక్కడో మిణుకుమిణుకుమంటూ నక్షత్రం లాటి దీపం కనబడింది.

కమ్మరి వైభారుడు ఆ దీపం కనిపించిన దిక్కుగా నడవసాగాడు. ఇప్పుడు దారి సాఫీగా, మెలిక లేమీ లేకుండా ఉంది. అతను చాలా దూరం నడిచి ఒక విశాల మైన ఆవరణ చేరుకున్నాడు. దాని రాతి కప్పు నుంచి ఒకే ఒక దీపం వెలుగు తున్నది. దాని కిందుగా ఒక పెద్ద రాతిబల్ల ఉన్నది. ఆ బల్ల చుట్టూ తాటి ప్రమాణం గల రాక్షసులు చాలా మంది మౌనంగా, నిశ్చలంగా కూర్చుని ఉన్నారు. వాళ్ళను చూస్తేనే వైభారుడికి గుండె ఆగిపోయి నట్టయింది.

రాక్షసులందరిలోకీ ముఖ్యుడులాగా కనిపించిన వాడు కమ్మరిని చూసి, ఉరుము లాటి పెద్ద గొంతుతో, "ఏం కావాలి?" అని అడిగాడు.

ఆ గొంతు విని కమ్మరి శరీరంలోని రక్తమంతా నీరుగా మారిపోయినట్టయింది. అయినా అతను ధైర్యంగా, "లలితుణ్ణి తీసుకుపో వచ్చాను. వాడికి నౌకరీ గడువు అయిపోయిందిట," అన్నాడు.

"ఎవరు పంపారు నిన్ను?" అని పెద్ద రాక్షసుడు మళ్ళీ అడిగాడు.

"నా అంతట నేనే బయలుదేరి వచ్చాను," అన్నాడు కమ్మరి.

"అయితే నా నౌకరు కుర్రవాళ్ళలో వాణ్ణి గుర్తుపట్టి తీసుకుపో. గుర్తుపట్ట లేకపోతే నీవు ప్రాణాలతో బయటికి పోవు. నా వెంటరా!" అంటూ పెద్ద రాక్షసుడు లోపల ఉండే మరొక విశాలమైన చావడిలోకి దారి తీశాడు. ఆ చావట్లో చాలా దీపాలున్నాయి, పందలకొద్దీ కుర్రవాళ్ళున్నారు. ఎవరి వయసూ ఏడేళ్ళు మించినట్టు కనబడలేదు. అందరూ ఒకే రకమైన ఆకుపచ్చ దుస్తులు ధరించి ఉన్నారు. కమ్మరి వైభారుడికి వారిలో లలితు డెవరో కనుక్కోవట మెట్లాగో కొంచెం కూడా తెలియరాలేదు.

"లలితుణ్ణి పోల్చుకుని తీసుకుపో. నీకు ఒకటే అవకాశం ఇస్తాను—రెండో అవకాశ మంటూ ఉండదు, గుర్తుంచుకో," అన్నాడు రాక్షసుడు.



కమ్మరి వైభారుడు కుర్రవాళ్ళందరినీ జాగ్రత్తగా గమనిస్తూ ఈ చివర నుంచి ఆ చివరకు నడిచాడు. లలితుణ్ణి గుర్తించటం తన కెంత మాత్రమూ సాధ్యంకాదని తేలిపోయింది. అతను రాక్షసుణ్ణి కొంచెం మంచి చేసుకుందామనుకుని, "ఈ పని వాళ్ళు ఎంతో కాలంగా మంచి గాలీ, ఎండా ఎరగకపోయినా ఎంత ఆరోగ్యంగా ఉన్నారు! మీరు వాళ్ళను ఎంతో బాగా చూసుకుంటున్నా రన్నమాట!" అన్నాడు.

"అది నిజం! నువు బాగానే కనిపెట్టావు. ఏదీ చెయ్యి?" అంటూ రాక్షసుడు చెయ్యి చాచాడు. ఆ చేతిని చూడగానే కమ్మరికి కంపరం పుట్టి తన చేతిలో ఉన్న క్రుచువ్వ అందించాడు. రాక్షసుడు దాన్ని తన చేతికి దారం చుట్టినట్టు చుట్టుకున్నాడు.

అది చూడగానే కుర్రవాళ్ళందరూ విరగబడి నవ్వసాగారు. కమ్మరి చప్పున ఆ నవ్వే కుర్రవాళ్ళందరినీ కలయ చూశాడు. వారిలో నవ్వని ముఖం ఒకటి కనబడింది. కమ్మరి వాడి భుజం మీద చెయ్యి వేసి, "ఇదుగో లలితుడు, తీసుకు పోవటానికి అనుమతి ఇవ్వండి," అని రాక్షసుడితో అన్నాడు. మరుక్షణమే దీపాలన్నీ మాయమయాయి. గాఢాంధకారం. పెద్ద పెద్ద కొండరాళ్ళు పడిపోతున్న చప్పుడు వినిపించింది. ఆ భీభత్సంలో కూడా కమ్మరి తాను తాకిన కుర్రవాణ్ణి తన చేతుల్లోకి ఎత్తుకున్నాడు. అంతలోనే అతనికి స్పృహ తప్పిపోయింది.

అతనికి తిరిగి స్పృహ వచ్చేసరికి అతను రాక్షసిమెట్ల పై భాగాన ఉన్నాడు. కుర్రవాడు అతని చేతుల్లోనే ఉన్నాడు. అప్పుడే తూర్పు తెల్లవారుతున్నది. అక్కడి నుంచి అతను ఎంతో శ్రమపడి కుర్రవాణ్ణి తల్లిదండ్రులకు చేర్చాడు. లలితుడు తిరిగి దొరకటమూ, అందు కోసం వైభారుడు పడ్డ శ్రమా కథలు గట్టి ఆ చుట్టుపక్కల వాళ్ళు ఎంతోకాలం చెప్పుకున్నారు.






శింశుపా వృక్షం ఎక్కిన హనుమంతుడు అక్కడి నుంచి చుట్టు పక్కలన్నీ కలయ జూశాడు. అశోక వనం దేవేంద్రుడి నందన వనం లాగుంది. దాని నిండా పూల చెట్లూ, పళ్ళ చెట్లూ ఉన్నాయి. పక్షులూ, మృగాలూ ఉన్నాయి. అక్కడక్కడా దివ్యమైన భవనాలూ, అరుగులూ, తామర పూలూ, కలువ పూలూ గల మడుగు లున్నాయి. అన్నిటి కన్న అశోక వృక్షాలు జాస్తిగా ఉన్నాయి.

కొద్ది దూరంలో ఒక ఎత్తయిన తెల్లని మంటపం ప్రకాశిస్తున్నది. అందులో వెయ్యి స్తంభా లున్నాయి. దానిలో పగడాలతో తయారు చేసిన మెట్లూ, బంగారు అరుగులూ ఉన్నాయి. అది ఒక చైత్యం ఆకారంలో ఉన్నది

తరవాత హనుమంతుడికి సీత కనిపించింది. ఆమె ధరించిన చీర మట్టి కొట్టుకుని ఉన్నది. ఆమె చుట్టూ రాక్షస స్త్రీ లున్నారు. ఆమె బాగా కృశించి, నిట్టూర్పులు పుచ్చుతూ, దైన్యంతో కూడుకుని ఉన్నది. దేహ సంస్కారం లేక ఆమె శరీరం కూడా మట్టి కొట్టుకుని ఉన్నది. నగలు చాలా కొద్దిగా ఉన్నాయి. ఆమె జుట్టు ఒకే జడ లాగా అట్ట కట్టుకుపోయి తుంటి దాకా వేళ్ళాడు తున్నది.

ఈమె సీత అయి ఉండాలని హనుమంతుడు ఈవిధంగా వితర్కించుకొన్నాడు: రావణాసురుడు ఎత్తుకు పోయేటప్పుడు ఆ స్త్రీలో తనకూ, సుగ్రీవాదులకూ కనిపించిన పోలికలు ఈమెలో కొన్ని ఉన్నాయి. నిండు



చంద్రుడి వంటి ముఖం. తీర్చినట్టుండే కనుబొమలు, నల్లని వెంట్రుకలు, అందమైన నడుము—సీత ఎంత కృశించి, శోక సముద్రంలో మునిగి ఉన్నా ఈ లక్షణాలు దాగటం లేదు. ఇవి గాక రాముడు సీత గుర్తులు కొన్ని చెప్పాడు. అందుచేత హనుమంతుడు ఆమె సీతే నని నిర్ణయించు కోవటానికి చాలా శ్రద్ధగా చూశాడు.

రాముడు చెప్పిన ఆభరణాలలో కొన్నిటిని ధరించటం ఇష్టంలేక ఆమె చెట్టు కొమ్మలకు తగిలించింది. వాటిలో చెవులకు పెట్టుకునేవీ, చేతులకు పెట్టుకునేవీ ఉన్నాయి. అవి తీసి వేసినట్టుగా సీత చెవులకూ, చేతులకూ గుర్తులు కానవస్తున్నాయి. అదీ గాక సీత ఋశ్యమూక పర్వతం పైన మూట గట్టి పడవేసిన ఆభరణాలలో ఇవి లేవు. అదీ గాక సీత నగలను మూట గట్టిన పచ్చ పట్టు వస్త్రమూ, ఆమె ఇప్పుడు కట్టుకొన్న చీరా ఒకటి గానే ఉన్నాయి—కాకపోతే చీరె చాలా మాసి ఉన్నది. ఇవన్నీ ఆలోచించి హనుమంతుడు ఆమె సీతే నని నిశ్చయించుకుని పరమానందం చెందాడు.

మరుక్షణమే సీత స్థితి తలుచుకుని హనుమంతుడి గుండె నీరై పోయింది. జనకుడి కుమార్తె, దశరథుడి పెద్ద కోడలు, ఎన్నో సుఖాలు అనుభవించ వలిసిన ఈ సీత కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ, శుష్కించి, ఈ భయంకర రాక్షస స్త్రీల మధ్య ఇలా కుమిలిపోవట మేమిటి? ఈ సీత కోసం రాముడు ఎందరు రాక్షసులను చంపాడు! ఈమె కోసమేగదా అతను వాలిని చంపి సుగ్రీవుడికి పట్టం గట్టాడు! ఈమె కోసమే గదా తాను సముద్రాన్ని లంఘించి లంకకు వచ్చాడు! ఈమె కోసం రాముడు మూడు లోకాలూ తల్లకిందులు చెయ్యమన్నా చేస్తాడు. "పరాయి వాణ్ణయిన నాకే ఈ సీతను చూసి ఇంత బాధ కలుగుతూంటే రాముడి కింకా ఎంత దుఃఖం

కలుగుతూండవచ్చు?" అనుకున్నాడు హనుమంతుడు శింశుపా వృక్షం కొమ్మల మీద కూర్చుని.

రాత్రి చాలా భాగం గడిచింది. రాక్షస బ్రాహ్మణులు వేదాధ్యయనం ప్రారంభించారు. మంగళ వాద్యాలు మోగాయి. రావణుడు వాటి ధ్వనికి మేలుకొని, సీతను జ్ఞాపకం తెచ్చుకున్నాడు. వెంటనే అతను సమస్తా భరణాలూ ధరించి, వెలిగి పోతూ అశోక వనానికి బయలుదేరాడు. అతని వెంట నూరు మంది స్త్రీలు వచ్చారు. వారిలో కొందరు బంగారు దీప స్తంభాలూ, కొందరు చామరాలూ, మరి కొందరు విసన కర్రలూ పట్టుకున్నారు. ఒకతె తన కుడి చేతిలో మణి మయమైన మద్య భాండం తీసుకున్నది, మరొకతె రావణుడి వెనుక నుంచి బంగారు కర్ర గల తెల్ల గొడుగు పట్టింది.

వారందరూ అశోక వన ద్వారం దగ్గిరికి వచ్చే సరికి, చెట్టు మీద ఆకుల చాటున ఉన్న హనుమంతుడు వారిని చూశాడు. రావణుణ్ణి ఇంకా బాగా చూడటానికి హనుమంతుడు కింది కొమ్మ మీదికి దిగాడు.

రావణుడు ఇంకా అంత దూరంలో ఉండగానే సీత భయంతో కంపించిపోయింది. ఆమె ముడుచుకుని కూర్చుని ఏడవసాగింది. కటిక



నేల మీద కూర్చుని, భయపడి ఏడుస్తూ, దుమ్ము కొట్టుకుని ఉన్న సీతతో రావణుడిలా అన్నాడు:

"నన్ను చూసి ఎందుకు భయపడతావు, సీతా? ఇక్కడ నీకు హాని చేసే వారెవరూ లేరు. నేనా నీ మీది మోహంతో తపించి పోతున్నాను. కాని నీకు నా మీద కొంచెం కూడా ప్రేమ లేదు. ఎందు కిలా శోకిస్తావు? నన్ను నమ్ము, స్నేహ బుద్ధితో చూడు. తల దువ్వుకోక, మురికి బట్ట కట్టుకుని, అర్థం లేని ఉపవాసాలు చెయ్యటం నీ కెంత మాత్రమూ తగదు. కారిపోయిన నీటి లాగా పోయిన యౌవనం తిరిగి రాదు. భోగాలు



అనుభవించు. నీ వంటి అందగత్తె సృష్టిలో లేదు. నన్ను చేపట్టితే నిన్ను అగ్ర భార్యను చేస్తాను. ప్రపంచమంతా జయించి నీ తండ్రి జనకుడికి కానుకగా ఇస్తాను. అదృష్టహీనుడై, రాజ్యం పోగొట్టుకుని, అడవులలో అలమటించే ఆ రాముడింకా బతికి ఉంటాడా అని నా సందేహం. ఒక వేళ బతికి ఉన్నా అతడు నిన్ను చూడను కూడా లేడు. పూర్వం తన భార్యను ఇంద్రుడెత్తుకు పోతే హిరణ్యకశిపుడు నారదుడి చేత అడిగించి తెచ్చుకున్నాడు. రాముడి గతీ అంతే. అయితే అతను ఎంత వినయంగా అడిగినా నేను నిన్నివ్వను. కృశించి, మట్టి కొట్టుకుని ఉంటేనే నీ అందం నా మనస్సు హరించేస్తున్నదే, చక్కగా అలంకరించుకుని, మంచి బట్టలు కట్టుకుని, సంతోషంగా ఉంటే ఎలా ఉంటావో! హాయిగా తిను, తాగు, సుఖించు. నీ కేమిటి లోపం?"

ఈ మాటలు విని సీత ఒక గడ్డి పోచను తనకూ రావణుడికీ మధ్యగా పట్టుకుని, దీనస్వరంతో ఇలా చెప్పింది :

"నా మీది ఆశ వదులుకో. పాపిష్ఠి వాడికి మోక్షం ఎంత దుర్లభమో, నీకు నేనూ అంతే. నే నింకొకడి భార్యను, పతివ్రతను. నీ భార్యలను ఇతరులు కోరితే నీ కెలా ఉంటుందో ఆలోచించుకో. నీకు బుద్ధి చెప్పే వారెవరూ లేరో, లేక చెప్పినా నీవు వినవో! కాని నీవు చేసిన పని నీకూ, నీ రాజ్యానికీ, రాక్షస కులానికీ చేటు కలిగించేది. నాకు కావలసింది నీ అంతఃపుర స్త్రీల పై పెత్తనమూ కాదు, డబ్బూ కాదు, ఇంకేదీ కాదు—నా భర్త వెంట ఉండటం. నాలుగు కాలాలపాటు సుఖంగా ఉండాలంటే నన్ను రాముడి దగ్గిర చేర్చు. రాముడితో స్నేహం చేసుకో. శరణన్న వారిని రాముడు క్షమించగలడు. లేదా, రామలక్ష్మణుల మూలంగా నీకు సర్వ నాశనం తప్పదు. నీవు పిరికిపందవు. రాముడు జన



స్థానంలో ఉన్న రాక్షసుల నందరినీ చంపెయ్యటం చూసి భయపడి, రామలక్ష్మణు లిద్దరూ బయటికి వెళ్ళి ఉండగా నన్ను దొంగిలించి తెచ్చావు. వారి గాలి ఏమాత్రం సోకినా, పులుల వాసన తగిలిన కుక్కలాగా నీవు పారిపోయి ఉందువు. అటువంటి రామ లక్ష్మణులతో యుద్ధం పెట్టుకోకు."

సీత ఆడిన ఈ పరుష వచనాలకు రావణుడు మండిపడి, "నీ వన్న ఈ మాటలలో ప్రతి ఒక్క మాటకూ నిన్ను చంపవచ్చును. కాని నీ మీది మోహం చేత నేనా పని చెయ్యలేకుండా ఉన్నాను. నేను చెప్పిన గడువింకా రెండు మాసా లున్నది. ఈ లోపల నా భార్యవు కావటానికి సమ్మతించవో, నిన్ను ఉదయపు ఫలహారం కింద వండించుకు తింటాను," అన్నాడు.

అతను సీత వెంట ఉన్న రాక్షస స్త్రీలతో, "మీరు నయానో, భయానో ఈ సీత మనస్సు నా మీదికి మళ్ళేటట్టు చేయండి. ఆమె కిష్టం లేని పనులు చేయటానికి కూడా ఇప్పుడనుజ్ఞ ఇస్తున్నాను," అన్నాడు.

రావణుడి వెంట ఉన్న భార్యలలో దేవగంధర్వ స్త్రీలు సీతను చూసి జాలిపడి, తమ సానుభూతిని ఆమెకు సంజ్ఞల ద్వారా తెలియ జేశారు. రావణుడి కడగొట్టు భార్య అయిన ధాన్యమాలిని రావణుణ్ణి కౌగలించుకుని, "ఈమెకు నీపై ఇష్టం లేదు. ఆమె పైన ఎందుకు లేని పోని ఆశ పెట్టుకుంటావు? ఆమెకు సుఖపడే గీత లేదు. అందుకే నిన్ను వరించటం లేదు," అన్నది.

రావణు డీ మాట విని చిరు నవ్వు నవ్వి స్త్రీలతో సహా తన యింటికి తిరిగి వెళ్ళాడు. అతను వెళ్ళి పోగానే రాక్షస స్త్రీలు సీతను మాటలతో హింసించారు, ఆయుధాలతో బెదిరించారు. కొందరు రావణుణ్ణి పొగడారు. కొందరు రాముణ్ణి తిట్టారు. "మేము చెప్పినట్టు చెయ్యకపోతే నిన్నిప్పుడే తినేసి, సీత

చచ్చిపోయిందని రావణుడితో చెబుతాం,'' అన్నారు. ''మళ్ళీ పోట్లాడుకోకుండా దీన్ని ముందుగానే ముక్కలు ముక్కలుగా కోసి సమంగా పంచండి,'' అన్నది మరొకతె. కల్లు కూడా ఉంటే ఇంకా బాగుంటుందని మరొకతె అన్నది.

సీతకు ఒక వంక భయమూ, మరొక వంక అసహ్యమూ కలిగాయి. ఆమె తాను కూర్చున్న చోటి నుంచి లేచి శింశుపా వృక్షం కేసి నడిచి ఒక అశోక వృక్షం కింద దాని కొమ్మ పట్టుకుని నిలబడి తన దుస్థితిని గురించి తలుచుకుని బాధ పడింది. రామ లక్ష్మణులు మరణించి ఉంటారా, రావణుడు వారిని ఈపాటికి చంపించి ఉంటాడా అని ఆమెకు కొంచెం సేపు అనుమానం కలిగింది. వాళ్ళు సన్యసించారేమోనని మరొకసారి సందేహించింది. రాక్షస స్త్రీలు ఆమెను చుట్టు ముట్టి ఇంకా భయపెడుతూనే ఉన్నారు.

ఇంతలో త్రిజట అనే ముసలి రాక్షసి అప్పుడే నిద్ర లేచి, పెద్దగా మూలుగుతూ, ''సీతను తినెయ్యకండ్రా, కావలిస్తే నన్ను తినండి. నా కొక భయంకరమైన కల వచ్చింది,'' అన్నది. రాక్షస స్త్రీలు ఈ మాటకు భయపడి, దాని చుట్టూమూగి



ఏం కల వచ్చిందని త్రిజట నడిగారు. త్రిజట ఇలా చెప్పింది :

''రాముడు తెల్లటి పూల మాలలు వేసుకుని, తెల్ల బట్టలు కట్టుకుని, దంతంతో చేసిన పల్లకీలో ఎక్కి, లక్ష్మణుడితో సహా, వెయ్యి హంసలు మోస్తుండగా ఆకాశ మార్గాన లంకకు వచ్చాడట. ఈ సీత తెల్లని చీర కట్టుకుని, సముద్రం మధ్య ఉండే శ్వేతపర్వతం మీద ఉన్నట్టు నాకు కలలో కనిపించింది. రామలక్ష్మణులు నాలుగు దంతాలు గల పెద్ద ఏనుగు నెక్కి లంకలో సంచరించటం కనిపించింది. ఆ రామ లక్ష్మణులు సీతను సమీపించారు. రాము డెక్కిన

ఏనుగు శ్వేతపర్వత శిఖరం పైగా ఉంటే సీత దాని పైకి ఎక్కింది. తరవాత, రాముడి తొడ పైన కూర్చున్న సీత లేచి, చేతులతో సూర్య చంద్రులను పట్టుకుంటున్నట్టు కనిపించింది. ఆ తరవాత రాముడు ఎనిమిది తెల్ల యెద్దులు లాగే రథం మీద సీతతో ఇక్కడికి రావటం చూశాను. సీతా రామ లక్ష్మణులు పుష్పక విమాన మెక్కి ఉత్తరంగా వెళ్ళటం నాకు కనిపించింది. ఇక రావణుడు గన్నేరు పూల మాలలు ధరించి, ఒళ్ళంతా నూనె పూసుకుని, ఎర్ర బట్ట కట్టుకుని, తాగిన మత్తులో నేల పైన పడి ఉండటం కనిపించింది. ఇంకోసారి రావణుడు పుష్పక విమానం నుంచి కింద పడి, నున్నని, జుట్టు లేని తలతో, నల్లని బట్టలు కట్టుకున్న ఆడది ఈడుస్తున్నట్టు కనిపించాడు. మరొకసారి రావణుడు ఎర్ర పూల మాలలూ, రక్త చందనమూ ధరించి, నూనె తాగుతూ, నవ్వుతూ, నాట్యం చేస్తూ, మతిపోయి గాడిదలు పూన్చిన రథం పైన పోతూ కనిపించాడు. ఒకసారి రావణుడు గాడిద నెక్కి దక్షిణంగా పోతూ, దాని మీద నుంచి తల్లకిందులుగా నేల మీద పడటం చూశాను. అక్కడి నుంచి లేచి అతను నోటికి వచ్చినట్టు దుర్భాషలాడుతూ ఒక బురద గుంటలో పడి మునిగి పోయాడు. కుంభ కర్ణుడు కూడా ఇలాటి స్థితిలోనే కనిపించాడు. రావణుడి కొడుకులు శరీరంపై నూనె పోసుకోవటం కనిపించింది. రావణుడు పందినీ, ఇంద్రజిత్తు మొసలినీ, కుంభ కర్ణుడు ఒంటెనూ ఎక్కి దక్షిణంగా పోవటం చూశాను. గోపురాలూ, తోరణాలూ విరిగి పడిపోయిన లంక సముద్రంలో మునగటం కనిపించింది. రాముడి దూత అయిన ఒక కోతి లంకను తగలబెట్టాడట. అందుచేత మీ అఘాయిత్యం చాలించి సీతతో మంచిగా ఉండండి, లంకకు చేటు రానున్నది."



# 26. ఫుజిసాన్

ఫుజియామా అనే మరొక పేరుగల ఈ పర్వత శిఖరం జపానులో కెల్లా ఎత్తయినది (12,395 అడుగులు.) ఇది అగ్నిపర్వతం. 200 ఏళ్ళ క్రితం ఇది పేలి టోకియో నగరాన్ని అరంగుళాల బూడిద కింద కప్పేసింది. అగ్ని ముఖం వెడల్పు 2000 అడుగులు. జపానీయులు దీన్ని పూజిస్తారు.





# ప్రశ్నోత్తరాలు

CHITRA

1. *అలపాటి గుప్త, విజయవాడ*

రామాయణం [డిసెంబరు]లో మండోదరి అని వ్రాయుటకు మందోదరి అని వ్రాసినారు. తప్పులేని "చందమామ"కు ఈ తప్పేమిటి?

మందోదరి అనటం తప్పుకాదు. వాల్మీకి "మండోదరి" అనే మాట వాడనే లేదు. ఆ మాటను తరువాత వచ్చిన వారెవరో పుట్టించారు. ఇదే విధంగా ఋశ్యశృంగుడు అన్న మాట ఋష్యశృంగుడు అయింది, లంక అనేది లంకిణి అయింది.

2 *కర్రా సోమసుందర్రావు, చాగల్లు*

...(మందోదరిని) చూచి సీతే ననుకొని హనుమంతుడు ఒక్క క్షణంపాటు సంతోషించి మరుక్షణములో అనుమానము పడ్డాడు. ఎందుచేత హనుమంతుడు క్షణకాలం సంతోషించినాడో నాకు తెలియుడం లేదు.

తనకు సీత కనబడిందిగదా అని సంతోషించాడు. అతను శ్రమపడి సముద్రం దాటి వచ్చింది సీతను చూడటానికే గద!

3, *ఎ. వి. సుబ్రమణ్యం, టి. పి. కోట*

లంకానగర ద్వారపాలకియగు లంకిని హనుమంతునికి లొంగిపోయినది అని వ్రాసినారు. కాని నేను లంకిని సంహరింపబడినట్లు చదివితిని.

లంకిని అనేది ఒక ప్రత్యేక వ్యక్తికాదు, వాల్మీకి రామాయణంలో అది లంకానగర దేవత యొక్క భౌతిక రూపం. లంకానగరం నాశనమైతేనే అది నాశనమవుతుంది. లంకిని (లంకిణి) అనేది ఒక ప్రత్యేక రాక్షసి అనుకున్నవారు, హనుమంతుడిచేత అది చచ్చినట్టు రాశారు. వాల్మీకి అలా రాయలేదు.

4. *గుడివాడ అప్పారావు, కాకినాడ*

రామాయణం ఏ నెల "చందమామ"తో ప్రారంభము అయినది తెలియజేస్తారా?

1961 మే సంచికలో రామాయణం (బాలకాండ) ప్రారంభమయింది.

5. *కటికిరెడ్డి కనకలింగేశ్వరరావు, ఏలూరు*

మొదటి పేజీలో చంద్రుడు, దాని మధ్య ఉడత ఉన్నట్టు చిత్రిస్తారు, దాని అర్థమేమిటండి?

చంద్రుడికి శశాంకుడనే పేరున్నది. శశం అంటే కుందేలు. కుందేలు చిహ్నం చంద్రుడిలో చిత్రిస్తున్నాం—అది ఉడత కాదు.

6. *సి. కె. సీతారాం, బళ్ళారి*

సంక్రాంతి పండుగ మాత్రం జనవరి 14 వ తేదీ నాడే వచ్చుటకు కారణమేమి?

మన పండుగలలో చాలా భాగం చంద్రుడి గమనాన్ని ఆధారం చేసుకున్నవి. అందుకే అవి ప్రత్యేక మాసాలలో ప్రత్యేక తిథులనుబట్టి వస్తాయి. ఉదాహరణకు, వినాయక చవితి, దీపావళి అమావాస్య, కార్తీక పూర్ణిమ, వైకుంఠ ఏకాదశి. సంక్రాంతి అలాకాక సూర్యుడి గమనాన్ని—సరిగా చెప్పాలంటే సూర్యుడి చుట్టూ భూమిగమనాన్ని—బట్టి వచ్చేది. ఇంగ్లీషు పంచాంగం దానికి తూచా తప్పకుండా ఉంటుంది. అందుచేత సంక్రాంతి విధిగా జనవరి 13, 14 తేదీలలో వస్తుంది.

7. *కె. సుందరబాబు, ఏలూరు*

భూమి—సూర్యుడు, భూమి—చంద్రుడు—ఇవి గమిస్తున్నప్పుడు వీటి మధ్య దూరం మార్పుచెందుతుందా, లేదా?

తప్పక మారుతుంది. భూమికీ, సూర్యుడికీ మధ్య ఉండే సరాసరి దూరం 9 కోట్ల 30 లక్షల మైళ్ళు; కాని ఒకప్పుడిది 15, 16 లక్షలు తగ్గుతుంది, అంతే హెచ్చుతుంది. అలాగే చంద్రుడు భూమికి 2,38,000 మైళ్ళు సరాసరి దూరం; ఇది ఒకప్పుడు 2,53,000 అవుతుంది, ఒకప్పుడు 2,21,600 మాత్రమే ఉంటుంది.

8. *డి. సుగుణకుమారి, రొంపిచెర్ల*

రాత్రిపూట చంద్రునిచుట్టు మండలం యేర్పడుతుందిగదా! అది యొకప్పుడు చంద్రునికి దగ్గిరగానూ, కొన్ని సమయములలో దూరంగానూ కడుతోంది. అదేమిటండీ?

మనకూ చంద్రుడికీ మధ్య నీటి ఆవిరితో గూడిన మబ్బు పొరలు అడ్డున్నప్పుడు చంద్రుడి చుట్టూ వలయం కనిపిస్తుంది. పొరలు చాలా ఎత్తున ఉన్నప్పుడు వలయం చిన్నదిగానూ, తక్కువ ఎత్తులో ఉన్నప్పుడు పెద్దదిగానూ కనిపిస్తుంది. ఆకాశం నిర్మలంగా ఉంటే వలయమే ఉండదు.

Photo by M. A. Mohana Rao



బహుమతి
పొందిన వ్యాఖ్య

చక్కని చిన్నది

పంపినవారు :
జి. సన్యాసయ్య, అల్లీపురం

Photo by M. A. Mohana Rao



బహుమతి
పొందిన వ్యాఖ్య

జంటగ నున్నది

పంపినవారు:
జి. సన్యాసయ్య, అల్లీపురం

# నక్షత్రలోకం

లెక్కించటానికి అలవిగాని వని చెప్పేవాటిలో ఆకాశంలోని నక్షత్రాలను కూడా మన పూర్వులు చేర్చేవారు. ఇది నిజంకాదు. మన పూర్వులు ఆకాశాన్ని ఉత్త కంటితోనే చూశారు గనక వారికి నక్షత్రాలు అసంఖ్యాకమైనవి కానవసరంలేదు. ఉత్త కంటికి కనిపించే నక్షత్రాలు సుమారు మూడు వేలు మాత్రమే. వాటి జాబితా ఏనాడో తయారయింది. క్రీస్తుపూర్వం నాలుగో శతాబ్దిలో షిషేంగ్ అనే చీనావాడు ఆకాశంలోని నక్షత్రాలనూ, వాటి స్థానాలనూ జాబితా వేశాడు. అటు తరవాత హిప్పార్కస్ అనే గ్రీకు నక్షత్రవేత్త సొంతాన వెయ్యి కాంతి వంతమైన నక్షత్రాల జాబితా తయారు చేశాడు. తిరిగి 15-వ శతాబ్దిలో సమర్కండును పరిపాలించిన ఉలుఫ్ బేగ్ నూరుమంది శాస్త్రవేత్తలను నియోగించి నిర్దుష్టమైన నక్షత్రాల పట్టిక తయారు చేయించాడు. టెలిస్కోపుల సహాయం లేకపోయినప్పటికీ ఈ పట్టికలో నక్షత్రాల స్థానాలు నిర్దుష్టంగా ఉన్నాయి. ఈ పట్టికలోని కొంత భాగం ఇప్పటికీ సమర్కండ్‌లో ఉన్నది.

టెలిస్కోపు సహాయంతోనే మనం అసంఖ్యాకమైన నక్షత్రాలను చూడగలం. గెలీలియో కొద్ది శక్తిగల తన టెలిస్కోపుతో ఆకాశాన్ని చూస్తే, ఉత్త కంటికి 3 నక్షత్రాలు మాత్రమే కనిపించిన మేరలో 20 నక్షత్రాలు కనిపించాయి. ఈ కాలపు శక్తివంతమైన టెలిస్కోపులతో చూస్తే కోట్ల కొద్దీ నక్షత్రాలు కనబడతాయి.

అయితే నక్షత్రాలను పట్టి ఇవ్వటానికి అచ్చగా టెలిస్కోపులుగాక, ఫొటోలు అంతు లేని సహాయం చేస్తున్నాయి. ఎంత పెద్ద టెలిస్కోపులో నుంచి చూసినా, కంటికి వెంటనే కనబడని నక్షత్రం గంటల తరబడి చూసినా కనబడదు. అలాటి నక్షత్రాన్ని కూడా చాలా సేపు ఫొటో "ప్లేటు" మీద "ఎక్స్‌పోజు" చేస్తే అది ఫొటోలో కనిపిస్తుంది. కొద్దిసేపే "ఎక్స్‌పోజు" చేస్తే కాంతివంతమైన నక్షత్రాలే ఫొటోలో కనిపిస్తాయి. కాని గంటల తరబడి "ఎక్స్‌పోజు" చేసినప్పుడు నల్లని ఆకాశం నిండా నక్షత్రాలుండటం కనిపిస్తుంది. (బొమ్మ చూడండి) అనేక గంటలపాటు నక్షత్రాలు ఒకే స్థానంలో ఉండవు గనక, ఫొటో తీసేటప్పుడు నక్షత్రాలకు అనుగుణంగా టెలిస్కోపు కదిలే ఏర్పాటు చేస్తారు.

నక్షత్రాలన్నిటి కాంతీ కలిపినా పౌర్ణమి చంద్రుడి కాంతిలో మూడు వేల వంతు కంటె హెచ్చుండదు. నక్షత్రాలను వాటికి గల కాంతిని బట్టి తరగతులుగా విభజించారు. నక్షత్రాలన్నీ సమానమైన కాంతి కలవి కాకపోవటమే గాక అన్నీ ఒకే రంగు కలవికూడా కావు. "సిరియస్" అనే నక్షత్రం తెల్లనిది; "కాపెలా" పసుపు పచ్చనిది; "ఆర్క్‌ట్యూరస్" వంగపండు రంగుది; "ఆల్డిబరాన్" ఎర్రనిది. నక్షత్రాల కన్నిటికి శాస్త్రవేత్తలు పేర్లు పెట్టలేదు, హెచ్చు కాంతి కలవాటికే పేర్లు పెట్టారు. మిగిలిన వాటికి అవి ఉండే రాసి పేరూ, సంకేతాక్షరమూ మాత్రమే ఉంటాయి.

కొన్నికొన్ని నక్షత్రాలు చేరి ఒక రాసిగా ఉండటమూ, దాని ఆకారాన్ని బట్టి పేర్లు పెట్టటమూ ఏనాడో జరిగింది. సూర్య చంద్రులూ, గ్రహాలూ నడిచే ఆకాశ భాగాన పన్నెండు రాసులున్నాయి. ఈ నక్షత్రమండలాలకు ప్రపంచమంతటా దాదాపు ఒకే రకం పేర్లున్నాయి. ఈ పన్నెండూ గాక ఆకాశం నిండా ఇంకెన్నో రాసులున్నాయి. అలాటి వాటిలో సప్తర్షి మండలం ఒకటి. ఈ నాడు నక్షత్రవేత్తలు **88** నక్షత్ర రాసులను లెక్కలోకి తీసుకుంటున్నారు. వాటిలో కొన్నిటికి "గడియారం," "మైక్రోస్కోపు," "పంపు" లాటి పేర్లు పెట్టారు.

గడిచిన **2,000** ఏళ్ళ కాలంలో నక్షత్రాల స్థానం కొంచెమైనా మారలేదు. అంత మాత్రాన అవి నిశ్చలంగా ఉన్నా యనుకోనవసరం లేదు. అవి చాలా వేగంగానే కదులుతున్నాయి. కాని ఆ నక్షత్రాలు ఎంతెంత దూరాలలో ఉన్నాయంటే వాటి స్థానచలనం గమనించటానికి కొద్ది వేల సంవత్సరాలు ఏమాత్రమూ చాలదు. ఈ నక్షత్రాల దూరాన్నీ, వాటి నుంచి కాంతి మనకు చేరటానికి పట్టే కాలాన్నీ మనం మళ్ళీమళ్ళీ జ్ఞాపకం చేసుకోవటం మంచిది. ఈ క్షణాన ఆకాశంలో ఉండే నక్షత్రాలన్నీ ఆరిపోయినా, మరి నాలుగేళ్ళదాకా మనకు ఆకాశం మామూలుగానే కనిపిస్తుంది. ఆ తరవాత ఒకే ఒక్క నక్షత్రం—అదికూడా కంటికి కనబడనిది—"ఆల్ఫా సెంటారై" టెలిస్కోపులో కనిపించకుండా పోతుంది; మిగతా నక్షత్రాలన్నీ అలాగే ఉంటాయి. మరి మూడేళ్ళు గడిచినాక ఇంకో రెండు మూడు నక్షత్రాలు అదృశ్యం కావచ్చు. కాంతివంతమైన "సిరియస్" కనపడ కుండా పోవటానికి **9** ఏళ్ళు పట్టుతుంది...కొన్ని కోట్ల ఏళ్ళ దాకా కనిపిస్తూ ఉండే నక్షత్రాలు బోలెడన్ని ఆకాశంలో ఉండనే ఉంటాయి.



(ఎడమ) టెలిస్కోపులో కంటికి కనిపించే ఆకాశ భాగం.
(కుడి) అదే ఆకాశ భాగం **13** గంటల పాటు ఫోటో చేస్తే.

# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1964 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: చక్కని చిన్నది

రెండవ ఫోటో: జంటగ నున్నది

పంపినవారు: జి. సన్యాసయ్య, అల్లీపురం, వాల్తేర్.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

నడుంనొప్పిని
పోగొట్టుకోండి
ఇదిగో

# అమృతాంజనము

అమృతాంజన్‌లో శమనాన్ని కలిగించే 10 రకాల ఔషధాలు ఉన్నాయి. అతి శీఘ్రంగా అమోఘంగా నివారణను కలిగిస్తుంది. ఏ కొంచెమో అవసరముంటుంది కాబట్టి ఒక సీసా నెలల తరబడి వస్తుంది. 70 ఏళ్ళ పేరు పడ్డ నమ్మకమైన అమృతాంజన్ కండల నొప్పులకు, తలనొప్పికి, గుండె జలుబుకు ఇతర బాధలకు జలుబులకు నొప్పులకు అమోఘమైనది.

గాలి మార్పు నిత్యజీవితపు తాపత్రయాలు నొప్పులు, జలుబులు ఇతర బాధలు కలిగిస్తాయి. ఎప్పుడూ ఇంట్లో ఒక అమృతాంజన్ సీసా ఉంచుకోండి.

## అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు

అమృతాంజన్ క్రొత్తగా అట్టపెట్టెలో వస్తూంది. మోసం చేయడానికి వీలు లేకుండా సీసా 'అలూ కాప్‌తో సీలు చేయబడి ఉంటుంది.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM/2334

